అపరే-మరికొందరు;సర్వాణి-సమస్తములైన; ఇంద్రియ కర్మాణి- జ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క శబ్దాది వచనాది విషయములను; ప్రాణకర్మాణిచ- ప్రాణాదిదశవాయువులయొక్క బహిర్గమనాదికర్మములను; జ్ఞానదీపితే- జ్ఞానముచేత ప్రకాశింపఁ జేయఁబడిన; ఆత్మసంయమ యోగాగ్నౌ- తన ఇంద్రియ నిగ్రహమనెడి యుపాయముగల యగ్ని యందు, జుహ్వతి- వేల్చుచున్నారు.

మరికొందరు యెల్లజ్ఞానేంద్రియ కర్మేంద్రియములయొక్క శబ్దాది విషయములను ప్రాణాది దశవాయువుల బహిర్గమనాదికర్మలను జ్ఞానముచే ప్రజ్వలింపబడ్డ ఇంద్రియనిగ్రహమనెడినిప్పునందు హోమముచేసి నశింపజేయుచున్నారు.

ద్రవ్యయజ్ఞాస్తపో యజ్ఞా యోగయజ్ఞాస్తథా పరే।
స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞాశ్చ యతయస్సం శితవ్రతాః. 28

అపరే-మరికొందరు, ద్రవ్యజ్ఞాః- పుణ్యతీర్థాదులయందు ద్రవ్యదానమనెడి యజ్ఞముగలవారును, అపరే- మరికొందరు తపోయజ్ఞాః- కృచ్ఛ్రాది తపమనెడి యజ్ఞముగలవారును; అపరే- మరికొందరు; యోగయజ్ఞాః- ప్రాణాయామాది యోగ యోగములు యజ్ఞముగా గలవారలును; అపరే- మరికొం

దరు; స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాః- వేదపారాయణ శాస్త్రార్థపరి జ్ఞానములు యజ్ఞములుగాగలవారలును; అపరే- మరికొందరు; యతయః- జయింపబడిన ఇంద్రియములు గల వారలును; అపరే- మరికొందరు; సంశితవ్రతాః- తీక్ష్ణముగా జేయఁబడిన నియమములు గలవారలును.

మరికొందరు పుణ్య తీర్థములయందు ద్రవ్యదానమనే యజ్ఞకర్మ జేయుచున్నారు. కొద్దివారు, శరీరములను కృశింపచేయుటమనే యజ్ఞకర్మ చేయుచున్నారు. కొద్దిమంది, ప్రాణాయామాది యోగములనే యజ్ఞకర్మ జేయుచున్నారు. కొందరు, వేదపారాయణ వేదార్థ పరిజ్ఞానములనే యజ్ఞకర్మ చేయుచున్నారు. కొందరు, ఇంద్రియములను జయింపడమనే యజ్ఞకర్మ చేయుచున్నారు. మరికొందరు, కఠినమయిన నియమములనే యజ్ఞకర్మ జేయుచున్నారు.

అపానేజుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే।
ప్రాణాపానగతీరుద్ధ్వా ప్రాణాయామ పరాయణాః. 29

అపరే- మరికొందరు; అపానే- అపాన వ్యాపారమందు; ప్రాణః- ప్రాణవ్యాపారమును; జుహ్వతి-వేల్చుచున్నారు, తథా- అలాగుననే; ప్రాణే- ప్రాణవ్యాపారమందు; అపానం-అపానవ్యాపారమును; జుహ్వతి- వేల్చుచున్నారు; ప్రాణాయా

సర్వద్వారాణి- నవద్వారములను; సంయమ్య- లెస్సగా నియమించి; హృది-హృత్కమలమందు; మనః-మనస్సును; నిరుధ్య చ-అరికట్టిన్ని, (అప్పుడు వశీకృతమయిన మనస్సుచేతను హృత్కమలమునకంటె నూర్ధ్వగామియైన నాడిచేతను — నూర్ధ్వము నెక్కించి); మూర్ధ్ని- శిరఃప్రాంతమైన భ్రూమధ్యమందు; ఆత్మనః-తనయొక్క; ప్రాణం-ప్రాణవాయువును; ఆధాయ-ఉంచి; యోగధారణాం, యోగా-యోగముయొక్క ధారణాం-ధారణను; ఆస్థితస్సన్-ఆశ్రయించినవాడై - ఉత్కృష్టమైన ప్రాప్యస్థానమున పొందుచున్నాడని యుత్తరశ్లోకముతో సంబంధము.

ఇంద్రియద్వారములను బిగించి మనస్సును హృదయమందు నిలిపి తనప్రాణములను సహస్రారచక్రమునందుచేర్చి యోగమును అభ్యసించవలెను.

ఓ మిత్యేకాక్షరంబ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్।
యః ప్రయాతిత్యజన్ దేహం సయాతిపరమాంగతిమ్. 13

బ్రహ్మ-బ్రహ్మవాచకమైన; ఓమితి - ఓం యనెడి; ఏకాక్షరం, ఏక-ముఖ్యమైన, అక్షరం-వర్ణమును; వ్యాహరన్ - ఉచ్చరించుచున్నవాడై; మాం-ఆ ఓంకారవాచ్యుడయిననన్ను; అనుస్మరన్-చింతించుచున్నవాడై; దేహం- శరీరమును; త్య

జన్-త్యజించుచున్నవాడయి; యః- ఎవ్వడు; ప్రయాతి-పోవుచున్నాడో; సః-వాడు; పరమం-ఉత్కృష్టమైన; గతిం-ప్రాప్యస్థానమును; యాతి-పొందుచున్నాడు; (భగవంతునిపొందుటకు సులభోపాయమును జెప్పుచున్నాడు).

పరబ్రహ్మ వాచకమయిన ఓం అనెడి ఏకాక్షరమును ఉచ్చరించుచు ఓంకార స్వరూపుడయిన నన్ను చింతించుచు ఎవడైతే దేహమునువదలుచున్నాడో అట్టివాడు పరమోత్కృష్టమయిన మోక్షపదమును పొందుచున్నాడు.

అనన్యచేతాస్సతతం యోమాంస్మరతినిత్యశః।
తస్యాహంసులభఃపార్థ నిత్యయుక్తస్యయోగినః. 14

హే పార్థ-ఓయర్జునుడా! యః-యెవ్వడు; అనన్యచేతాః,అనన్య- అన్యవిషయముగానట్టి; చేతాః-మనస్సుగలవాడయి; మాం-పరమేశ్వరుడయిననన్ను; సతతం-యావజ్జీవమున్ను; నిత్యం- ప్రతిదినమున్ను; స్మరతి-చింతించుచున్నాడో;సత్యయుక్తస్య,నిత్య- యెల్లప్పుడున్ను, యుక్తస్య- సమాహితచిత్తుడయిన; తస్యయోగినః-ఆయోగికి; అహం - నేను; సులభః-సులభముగాబొందశక్యుడైనవాడను అన్యునికిసులభుడనుగానుట.

ఓ అర్జునా! ఎవడైతే విషయాంతరములందు ప్రవేశించని

నిశ్చల మనస్సుగలిగి పరబ్రహ్మస్వరూపుఁడయిననన్ను సర్వకాలములయందు చింతించుచున్నాఁడో అట్టి నిరంతరధ్యాన పరుడయినయోగికి నేను సులభుఁడను.

మాముపేత్యపునర్జన్మ దుఃఖాలయమశాశ్వతమ్।
నాప్నువంతిమహాత్మాన స్సంసిద్ధింపరమాంగతాః. 15

నీవు సులభ సాధ్యుడవగుటచేత నేమియగునని జెప్పుచున్నాడు. మహాత్మానః,మహత్-శ్రేష్ఠమయిన, ఆత్మానః-బుద్ధిగలవారలు; మాం-నన్ను; ఉపేత్య-పొంది; పరమాం-ఉత్కృష్టమైన; సంసిద్ధిం-మోక్షసిద్ధిని;గతాస్సంతః-పొందినవారలై; దుఃఖాలయం,దుఃఖ- ఆధ్యాత్మికాదిదుఃఖములకు, ఆలయం-ఆశ్రయమయిన; అశాశ్వతం-అస్థిరమయిన; పునర్జన్మ- పునర్జన్మమును; నాప్నువంతి-పొందరు.

మహాత్ములయిన యోగీశ్వరులు పరమోత్కృష్టమయిన యోగసిద్ధిచే నన్ను బొందినవారై నాశాస్పదమై దుఃఖాస్పదమయినట్టి జన్మములను పొందరు.

ఆబ్రహ్మభవనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్యతుకౌంతేయ పునర్జన్మనవిద్యతే. 16

హే అర్జున-ఓయర్జునుడా; ఆబ్రహ్మభవనాత్-బ్రహ్మలోకములోగూడ; లోకాః-సమస్తమయినలోకములు; పున

రావర్తినః, పునః-మరల, ఆవర్తినః- వచ్చెడిస్వభావముగలిగినవి; హేకౌంతేయ-ఓయిఅర్జున; మాం-నన్ను; ఉపేత్యతు-పొందియయితే; పునర్జన్మ-పునర్జన్మము; నవిద్యతే-లేదు.

ఓకౌంతేయా! బ్రహ్మాండమునకు లోబడిన యావత్తులోకములున్ను జీవులకు మరలజన్మములను ఇవ్వగల స్వభావము గలవి. నన్ను పొందిన పిదప నైతేనో పునర్జన్మములు లేవు.

సహస్రయుగపర్యంత మహర్యద్బ్రహ్మణోవిదుః।
రాత్రింయుగసహస్రాంతాం తేహోరాత్రవిదోజనాః.17

బ్రహ్మలోకముతో గూడిన సకలలోకములును యెందువల పునరావర్తి గలవని శంకించి కాలనిర్ణయమువలన నదిచెప్పుచున్నాడు. యేజనాః-ఏజనులు; అహోరాత్రవిదః - అహోరాత్రములనుదెలిసినవారలలో; తే-ఆజనులు; బ్రహ్మణః-చతుర్ముఖబ్రహ్మకు; యత్-ఏ; అహః-పగలును; సహస్రయుగపర్యంతం, సహస్ర- వేయియయిన; యుగ-యుగములు, పర్యంతం-తుదగాగలిగినదానినిగా; రాత్రిం - రాత్రిని; యుగసహస్రాంతాం, యుగ- యుగములయొక్క, సహస్ర-వేయి, అంతాం-తుదగాగలిగినదానినిగా; విదుః- తెలియుదురు.

సహస్ర మహాయుగకాల నిర్ణయమయిన బ్రహ్మ యొక్క పగటినిన్నీ అంతే పరిమాణముగల బ్రహ్మ యొక్క రాత్రిని

న్ని ఏ గొప్పవారు తెలియుదురో ఆట్టివారే రాత్రి పగళ్లు తెలిసిన వారలుగా నున్నారు.

అవ్యక్తాద్వ్యక్తయస్సర్వాః ప్రభవంత్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే. 18

అహరాగమే, అహః-బ్రహ్మదేవుని పగటియొక్క, ఆగమే-ఆగమనకాలమందు; అవ్యక్తాత్ - బ్రహ్మదేవునివలన; వ్యక్తయః-స్థావరజంగమాత్మకశరీరముగలిగిన; సర్వాః - సమస్తమయిన ప్రజలు; ప్రభవంతి-పుట్టుచున్నారు; రాత్ర్యాగమే-ఆబ్రహ్మకురాత్రివచ్చినకాలమందు; వ్యక్తయః - ప్రజలు; తత్రైవావ్యక్తసంజ్ఞకే-ఆబ్రహ్మదేవునియందే; ప్రలీయంతే-అడగుచున్నవి.

బ్రహ్మయొక్క పగటికాల ప్రారంభమందు అవ్యక్తమైన ప్రకృతిలోనుండి వ్యక్తమైనస్థావరజంగమాత్మక సర్వభూతప్రపంచములు బుట్టుచున్నవి. ఆ బ్రహ్మకు రాత్రికాలప్రారంభములో ఈ సమస్త ప్రపంచములు అవ్యక్తమయిన ప్రకృతిలో మరల లీనమగుచున్నది.

భూతగ్రామస్స ఏవాయం భూత్వాభూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే. 19

హే పార్థ-ఓయి యర్జునుడా; యః-ఏ;భూతగ్రామః-

ప్రాణిసమూహము పూర్వకల్పమందుబుట్టెనో; సఏవాయం-ఆ యీభూతసమూహమే; అవశస్సన్ - అస్వతంత్రమైనదై; అహరాగమే - పగలువచ్చినసమయమందు; ప్రభవతి - పుట్టుచున్నది; రాత్ర్యాగమే-రాత్రివచ్చినసమయమందు; ప్రలీయతే-లీనమవుచున్నది. (ఈప్రకారముగా) భూత్వాభూత్వా-పుట్టిపుట్టి; ప్రలీయతే-లీనమగుచున్నది.

ఓ అర్జునా! ఏ ప్రాణిసమూహము తత్పూర్వ కల్పమునందు జన్మించెనో ఆ ప్రాణిసమూహమే స్వాధీనములేనిదై పగలు వచ్చినప్పుడెల్ల బుట్టుచు రాత్రివచ్చునపుడెల్ల లీనమగుచున్నది.

పర స్తస్మాత్తుభావోఽన్యో వ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
యస్సనర్వేషుభూతేషు నశ్యత్సునవినశ్యతి. 20

తస్మాత్-ఆపూర్వోక్తమైన; అవ్యక్తాత్ - భూతసమూహమునకు గారణభూతుడైన చతుర్ముఖునికంటె; పరః- ఉత్కృష్టమైనదియును; అన్య -వ్యతిరిక్తమయినదియును; అవ్యక్తః-అగోచరమయినదియును; సనాతనః- శాశ్వతమయినదియునైన; యోభావః-ఏయక్షరబ్రహ్మముకలదో;సః - ఆపరబ్రహ్మము; సర్వేషుభూతేషు-సమస్తశరీరములు; నశ్యత్సునత్సు-నశించుచుండగా; నవినశ్యతి-నశింపదు.

పై జెప్పిన భూతమయ ప్రపంచములకు కారణరూపుడైన ఈశ్వరునికన్న వేరై ఉత్కృష్టమై అగోచరమై శాశ్వతమైయుండు పరబ్రహ్మమనునది ఒక్కటిఁ గలదు. ఆ పరబ్రహ్మము సమస్త ప్రపంచములు నశించుచుండగా అది నశించునది కాదు.

అవ్యక్తో౽క్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్।
యం ప్రాప్య ననివర్తంతే తద్ధామ పరమం మమ. 21

యః-ఏ పరబ్రహ్మము; అవ్యక్తః- ఇంద్రియగోచరమును; అక్షరః-నాశరహితమును; ఇతి-ఇట్లని; ఉక్తః - చెప్పబడెనో; తం-దానిని; పరమాం-ఉత్కృష్టమైన; గతిం- ప్రాప్యస్థానముగా; ఆహుః-చెప్పుచున్నారు; యః- ఏభావమును; ప్రాప్య - పొంది; ననివర్తంతే-జన్మాంతులకు దిరుగరో; తద్ధామ- ఆస్థానము; మమ-నాయొక్క; పరమం-పరమపదము.

ఏ పరబ్రహ్మము ఇంద్రియములకు గోచరముగాక నాశరహితముగా నున్నదని చెప్పబడెనో అదియే మిక్కిలి ఉత్కృష్టమయిన మోక్షస్థానముగా చెప్పఁబడుచున్నది. ఆ స్థానమును బొందినవారికి మరల జన్మములులేవు. అదియే నాస్థానమయిన పరమ పదముగా దెలియుగుము.

పురుషస్స పరః పార్థ భక్త్యాలభ్య స్త్వనన్యయా।
యస్యాంతస్థాని భూతాని యేనసర్వమిదం తతమ్. 22

హే పార్థ - ఓయర్జున; భూతాని-ప్రాణులు; యస్య-ఏపురుషునియొక్క; అంతస్థాని-లోపలనున్నవో; యేన-ఏపురుషునిచేత; సర్వం-సమస్తమయిన; ఇదం-ఈజగత్తు; తతం-వ్యాపింపబడెనో; సః - ఆ; పరః-ఉత్కృష్టుడయిన; పురుషః- పురుషుడు; అనన్యయా-ఇతరమందాసక్తిగాని; భక్త్యా-జ్ఞానముచేత; లభ్యః-పొందదగినవాడు.

ఓ అర్జునా! ఏ గొప్పవానియందు ఈ ఎల్లలోకములు లీనమయియున్నవో ఏ మహాపురుషునివల్ల ఈ లోకము లన్నియు వ్యాపింపఁబడియున్నవో అట్టి పరమపురుషుని ఇతరాసక్తి లేని చలించని భక్తియోగముచేత పొందవచ్చును.

యత్రకాలేత్వనావృత్తి మావృత్తించైవయోగినః।
ప్రయాతాయాంతితంకాలం వక్ష్యామిభరతర్షభ. 23

హే భరతవర్షభ-ఓయియర్జున; యత్రకాలేషు-ఏకాలమందైతే-ప్రయాతాః-పోయిన; యోగినః-కర్మయోగులు; ఆవృత్తిం-పునర్జన్మమును; యాంతి-పొందుచున్నారో; యత్రి-ఏకాలమందు; ప్రయాతాః - పోయిన; యోగినః - కర్మయోగులు; అనావృత్తిం-పునర్జన్మరాహిత్యమును; యాంతి-పొందుచున్నారో; తంకాలం - ఆకాలమును; వక్ష్యామి-చెప్పెదను.

ఓయి ధనంజయా! ప్రణవోపాసకులు శరీరమును వదలిన వారయి యే త్రోవన వెళ్ళి మరల జన్మములను పొందరో కర్మయోగులు శరీరమును వదలినవారయి యే త్రోవన వెళ్ళి మరల జన్మములను పొందుచున్నారో ఆ మార్గములను జెప్పుచున్నాను.

అగ్నిర్జ్యోతిరహశ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణం।
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః. 24

అగ్నిః- అగ్న్యభిమాని దేవతయు; జ్యోతిః- జ్యోతిరభిమాని దేవతయు; అహః- దివాభిమాని దేవతయు; శుక్లః- శుక్లపక్షాభిమాని దేవతయు; షణ్మాసాః- షణ్మాసాత్మకమయిన; ఉత్తరాయణం- ఉత్తరాయణాభిమాని దేవతయును మార్గమై యున్నది; తత్ర-ఆమార్గమందు; ప్రయాతాః-పోయిన; బ్రహ్మవిదః- బ్రహ్మవేత్తలయిన; జనాః-జనులు; క్రమేణ- క్రమముగా; బ్రహ్మ-బ్రహ్మమును; గచ్ఛంతి-పొందుచున్నారు.

యేత్రోవన అగ్న్యభిమాని దేవతయుదివసాభిమాని దేవతయుశుక్లపక్షాభిమాని దేవతయుఉత్తరాయణాభిమాని దేవతయు ప్రాపకులుగా నున్నారో దేహములువదలిఆయర్చిరాదిమార్గమున వెళ్ళుప్రణవోపాసకులు క్రమముగాముక్తిజెందుచున్నారు.

ధూమోరాత్రిస్తథాకృష్ణ షణ్మాసాదక్షిణాయనం।
తత్రచాంద్రమసంజ్యోతి ర్యోగీప్రాప్యనివర్తతే. 25

ధూమః- ధూమాభిమానిదేవతయు; రాత్రిః- రాత్ర్యభిమానిదేవతయు; తథా-అలాగుననే; కృష్ణః-కృష్ణపక్షాభిమానిదేవతయు; షణ్మాసాః- షణ్మాసాత్మకమయిన; దక్షిణాయనం- దక్షిణాయనాభిమాని దేవతయును మార్గమైయున్నది. తత్ర-ఆమార్గమందు; ప్రయాతః-పోయిన; యోగీ-కర్మయోగి; చాంద్రమసం- చంద్రసంబంధమయిన; జ్యోతిః- ఇష్టాపూర్తాది ఫలమును; ప్రాప్య-పొంది, నివర్తతే-మరలుచున్నాడు.

యే మార్గమున ధూమాభిమాని దేవతయు రాత్ర్యభిమాని దేవతయు కృష్ణపక్షాభిమాని దేవతయు దక్షిణాయనాభిమాని దేవతయు పాలకులుగా నున్నారో శరీరములను వదలి ఆధూమాదిమార్గమున వెళ్ళు కర్మయోగులు చంద్రలోకమును బొంది కర్మనశించిన వెనుక పునర్జన్మముల నెత్తుచున్నారు.

శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతశ్శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయావర్తతే పునః. 26

శుక్లకృష్ణే- జ్ఞానాజ్ఞాన ప్రకాశకములయిన; శాశ్వతే- నిత్యములయిన; జగతః- లోకమునకు; మతే- సమ్మతములయిన; ఏతే- ఈరెండును; గతీ-మార్గములు; (ఈమార్గములలో) ఏకయా- ఒకటైన శుక్లమార్గము చేత; అనావృత్తిం- రాక యుండుటను; యాతి- పొందుచున్నాడు.

ఈ పై ప్రకారము ఈ ప్రపంచమునకు శుక్లకృష్ణములనే జ్ఞానాజ్ఞానప్రకాశము లయిన రెండుమార్గములు శాశ్వతము గా నేర్పడియున్నవి. వానిలో జ్ఞానప్రకాశమయిన శుక్లమార్గ ము పునర్జన్మములులేనిదిగాను అజ్ఞానప్రకాశమయిన కృష్ణ మార్గము మరల జన్మములుగలదిగాను ఉన్నది.

నైతే సృతీపార్థజానన్ యోగీముహ్యతికశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తోభవార్జున. 27

హే పార్థ- ఓయి అర్జున; ఏతే-ఈచెప్పబడిన; సృతీ- మార్గములను; జానన్ -తెలిసిన; కశ్చన-ఒకానొకడైన; యోగీ- యోగి; నముహ్యతి-మోహమునొందడు; తస్మాత్ - ఆకారణ మువలన; సర్వేషు కాలేషు-సమస్తకాలములయందును; త్వం- నీవు; యోగయుక్తః-యోగముతోగూడినవాడవు; భవ-కమ్ము.

ఓ అర్జునా! పై వుదాహరించిన రెండు త్రోవలు యెరిగిన యోగులు మోసబోనేరరు. అందువలన ఎల్లకాలములయం దు నీవు యోగముతోకూడిన వాడవు అగుము.

వేదేషుయజ్ఞేషు తపస్సుచైవ దానేషుయత్పుణ్య
ఫలంప్రదిష్టమ్।
అత్యేతితత్సర్వ మిదంవిదిత్వా యోగీపరంస్థాన
ముపైతిచాద్యమ్. 28

వేదేషు-వేదములయందును; యజ్ఞేషు-యజ్ఞములయందును; తపస్సు-తపస్సులయందును; దానేషుచైవ-దానములయందును; యత్-ఏ; పుణ్యఫలం-పుణ్యఫలము; ప్రదిష్టం- ఉపదేశింపబడెనో; తత్సర్వం-అసమస్తఫలమును;యోగీ- యోగి; అత్యేతి-అతిక్రమించుచున్నాడు; కించ-ఇంతియేకాదు; ఇదం-ఈయర్థమును; విదిత్వా-ఎఱింగి;ఆద్యం-ఆదికారణమైన;పరం-ఉత్కృష్టమైన;స్థానం-బ్రహ్మమును;ఉపైతి- పొందుచున్నాడు.

యోగులు వేదార్థములు తెలిసికొనుట యందేమి క్రతువులు జేయుటయందేమి తపస్సులు జేయుటయందేమి దానములయందేమి జెప్పియుండు ఫలములను లక్ష్యము జేయరు. దీనియందు గల ఫలములు పునర్జన్మ హేతువులని యెరిగినవారై ఆదికారణమై పరమోత్కృష్టమైన పరబ్రహ్మమును పొందుచున్నారు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
అక్షర పర బ్రహ్మయోగోనామ అష్టమోధ్యాయః.

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జునసంవాద రూపంబగున అక్షర పర బ్రహ్మ
యోగ మనెడి అష్టమోధ్యాయము ముగిసినది.

శ్రీ భగవద్గీత.

# రాజవిద్యా రాజగుహ్య యోగోనామ నవమోఽధ్యాయః.

## శ్రీభగవాన్ ఉవాచ.

ఇదంతు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్. 1

యత్ - ఏ జ్ఞానమును; జ్ఞాత్వా-ఎఱింగి, అశుభాత్ - సంసారమువలన; మోక్ష్యసే-ముక్తుఁడవు కాఁగలవో; తత్-ఆ; గుహ్యతమం-మిక్కిలి గోప్యమయిన; విజ్ఞానసహితం- అనుభవజన్యజ్ఞానముతోఁ గూడిన; ఇదం జ్ఞానం- ఈజ్ఞానమును; అనసూయవే-అసూయారహితుఁడవై; తే - నీకొఱకు; ప్రవక్ష్యామి- లెస్సగాఁ జెప్పెదను.

అసూయలేని నీకు శాస్త్రసమ్మతమై అనుభవముతోఁ గూడుకొనిన ఈ క్రింద చెప్పఁబోయెడి రహస్యమగు జ్ఞానమును తెలియఁజెప్పెదను. దానిని తెలిసికొంటివేని అశుభమగు సంసారమునుండి నీవు నివర్తుఁడవు కాఁగలవు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిదముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్. 2

ఉత్తమం- ఉత్కృష్టమైన; పవిత్రం-పావనమైన; ఇదం-ఈ

బ్రహ్మజ్ఞానము; రాజవిద్యా- విద్యలలో శ్రేష్టమయినదియును; రాజగుహ్యం- రహస్యములలో శ్రేష్టమయినదియును; ప్రత్యక్షావగమం- ప్రత్యక్షసుఖబోధక మయినదియును; ధర్మ్యం- ధర్మ్యముతో గూడినదియును; కర్తుం- చేయుటకొఱకు; సుసుఖం- మిక్కిలి సుఖకరమయినదియును; అవ్యయం- నాశము లేనిదియును,

ఈ జ్ఞానము పరమోత్కృష్టమైనదిగా పరమ పావనమైనదిగా మిక్కిలి శ్రేష్ఠమైనదిగా పరమరహస్యమైనదిగా ప్రత్యక్షసుఖబోధకమైనదిగా ధర్మముతో చేరికొనునదిగా నాశరహితమయినదిగా అభ్యసించుటకు సులభమయినదిగా వున్నది.

అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని. 3

హే పరంతప- ఓయి అర్జున; అస్యధర్మస్య- ఈ యాత్మజ్ఞాన ధర్మమును; అశ్రద్ధధానాః- విశ్వసించని; పురుషాః- నాస్తికులయినపురుషులు; మాం-నన్ను; అప్రాప్య-పొందక; మృత్యుసంసారవర్త్మని- మృత్యురూపమయిన సంసారమార్గమందు; నివర్తంతే- నిశ్చయముగానున్నారు.

ఓ అర్జునా! ఇట్టి ఆత్మజ్ఞానధర్మమును నమ్మని మనుష్యులు నన్నుజెందక మృత్యువుతో గూడిన సంసారమునకు లో

బడుచున్నారు.

మయాతతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।

మత్స్థాని సర్వభూతాని నచాహం తేష్వవస్థితః. 4

అవ్యక్తమూర్తినా-ఇంద్రియగోచరముగాని స్వరూపము గల; మయా-నాచేతను; సర్వం-సమస్తమయిన; ఇదంజగత్-ఈజగత్తు; తతం-వ్యాపించబడెను, సర్వభూతాని-సమస్తజీవములును; మత్స్థాని-నాయందునుండునట్టివి; అహంచ-నేనును; తేషు-ఆభూతములయందు; నావస్థితః-ఉన్నవాడనుగాను.

ఈ సమస్త జగత్తు ఇంద్రియములకు గోచరము గాని రూపముగల నాచే వ్యాపింపఁబడియున్నది. ఈ సమస్తప్రాణిసమూహములు నాయందు నున్నవి. నేను ఆప్రపంచముల నంటియున్న వాడను కాను.

నచమత్స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।

భూతభృన్నచభూతస్థో మమాత్మా భూతభావనః. 5

భూతాని-బ్రహ్మాదిస్థావరాంతభూతములు; మత్స్థాని-నాయందున్నవి; న-కావు, (మరియేమనిన), ఐశ్వర్యం-ఈశ్వరసంబంధమయిన; మే-నాయొక్క; యోగం-చాతుర్యమును; పశ్య-చూడుము; మమ-నాయొక్క; ఆత్మా-స్వరూపము; భూతభృత్-ప్రాణులభరించునదియును; భూతభావనః - ప్రాణుల

నువృద్ధిబొందించునదియును; (అయినను), **భూతస్థః- భూతము** లయందున్నది; నచ-**కాదు.**

బ్రహ్మాది స్థావరాంత భూతములు నాయందున్నవి కావు. అయినను నాస్వరూపము యావత్తు ప్రపంచభూతములను భరించుచు అభివృద్ధిజెందించుచు వుండినను నేను ఆభూతముల యందు చేరినవాడను కాను ఈ చమత్కారమయిన నా స్వరూపమును తెలిసికొనుము.

యథాకాశస్థితోనిత్యం వాయుస్సర్వత్ర గోమహాన్।
తథాసర్వాణిభూతాని మత్స్థానీత్యుపధారయ. 6

యథా-ఏప్రకారముగా; సర్వత్రగః-అంతట వ్యాపించియున్న; మహాన్-అధికమయిన; వాయుః-వాయువు; నిత్యం - నిత్యమును; ఆకాశస్థితః-ఆకాశమందున్నదో; తథా- ఆప్రకారముగా; సర్వాణిభూతాని-సమస్తప్రాణులు; మత్స్థానీతి - నాయందున్నవని; ఉపధారయ-తెలియుము.

ఎల్లెడల వ్యాపించియున్న గొప్పవాయువు ఆకాశమందు ఏ విధముగ అణగియున్నదో ఆ విధముగ సమస్తభూతప్రపంచములు నాయందు వున్నవని యెఱుంగుము.

సర్వభూతానికౌంతేయ ప్రకృతింయాంతిమామికామ్।
కల్పక్షయేపునస్తాని కల్పాదౌవిసృజామ్యహమ్. 7

హే కౌంతేయ-ఓయర్జునా; కల్పక్షయే-కల్పాంతమందు; సర్వభూతాని-సమస్తప్రాణులు; మామికాం - నాసంబంధమయిన; ప్రకృతిం-మాయను; యాంతి-పొందుచున్నవి;అహం-నేను; కల్పాదౌ-సృష్టికాలమందు; తాని-ఆసర్వభూతములను; పునః-తిరిగిన్ని; విసృజామి-పుట్టించుచున్నాను.

ఓ అర్జునా! ప్రళయకాలమందు ఎల్ల భూతములు నా నంబంధమయిన ప్రకృతిలో లయించిపోవుచున్నవి. మరల సృష్టి ప్రారంభమున ఎల్ల ప్రపంచములను నేనుపుట్టించుచున్నాను.

ప్రకృతింస్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమంకృత్స్న మవశంప్రకృతేర్వశాత్. 8

స్వాం-స్వకీయమైన; ప్రకృతిం-మాయను; అవష్టభ్య-అవలంబించి; ప్రకృతేః-స్వభావముయొక్క; వశాత్ - అధీనమువలన; అవశం-అస్వతంత్రమైన; కృత్స్నం - సమస్తమైన; ఇమంభూతగ్రామం-ఈభూతసమూహమును; పునఃపునః - మాటిమాటికి; విసృజామి-పుట్టించుచున్నాను.

అస్వతంత్రమయిన ఈ సమస్తభూతసమూహమును వాటి ప్రకృతియనే మాయను చెంది ఆ ప్రకృతిస్వభావమువలన మరల మరల నేను పుట్టించుచున్నాను.

మపరాయణాః- పూరక రేచక కుంభక రూప ప్రాణాయామ మాశ్రయముగాఁ గలిగిన; అపరే- మరికొందరు; ప్రాణాపానగతీ- ప్రాణాపానవాయువుల గతులను; రుద్ధ్వా- నిగ్రహించి; జుహ్వతి- వేల్చుచున్నారు.

మరికొందరు, అపానమునందు ప్రాణ వ్యాపారమునున్ను ప్రాణమునందు అపానవ్యాపారమునున్ను, మరికొందరు పూరక రేచక కుంభక ప్రాణాయామములయందు ప్రాణాపానవాయువుల గతులను లయింపజేయుచున్నారు.

అపరే నియతాహారాః ప్రాణాన్ ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపిత కల్మషాః. 30

అపరే- మరికొందరు; నియతాహారాస్సంతః- పరిమితము లయిన యాహారము కలవారగుచు; ప్రాణాన్- వాయు విశేషములను; ప్రాణేషు- వశీకృత వాయువులయందు; జుహ్వతి- వేల్చుచున్నారు; ఏతే- యీ పూర్వమందు చెప్పబడిన; సర్వేఽపి- సమస్తమయిన వారలును; యజ్ఞవిదః- యజ్ఞములు తెలిసినవారలు; యజ్ఞక్షపితకల్మషాః- యజ్ఞములచేత నశింపజేయబడిన పాపములు కలవారలు.

మరికొందరు కొద్ది ఆహారములు గలవారగుచు ప్రాణవాయువులను వశీకృత వాయువులయందు, లయింపజేయుచు

న్నారు. ఈ పైన జెప్పిన ఎల్ల యోగపురుషులు, యజ్ఞకర్మ
లు ఎఱిఁగిన వారు గనుక, తమ పాపములను యజ్ఞకర్మలచే క్ష
శింప జేయుచున్నారు.

యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్।
నాయంలోకో స్త్యయజ్ఞస్య కుతోన్యః కురుసత్తమ. 31

యజ్ఞశిష్టామృతభుజః- యజ్ఞములలో మిగిలిన అమృతము
ను భుజించినవారు; సనాతనం- శాశ్వతమయిన; బ్రహ్మ- బ్ర
హ్మమును; యాంతి- పొందుచున్నారు; హే కురుసత్తమ- ఓ
యి కురుశ్రేష్ఠుడా; అయజ్ఞస్య- ఈ చెప్పిన యజ్ఞములలో నొక
టిని జేయని వానికి; అయం- ఈ సర్వప్రాణి సాధారణ మయి
న; లోకః- లోకము; నాస్తి- లేదు; అన్యః- పరలోకము; కు
తః- ఎక్కడిది.

ఓ అర్జునా! యజ్ఞకర్మలో శేషించిన భాగిమును భుజించిన
వారు శాశ్వతమయిన బ్రహ్మమును పొందుచున్నారు. ఈ పై
న జెప్పిన యజ్ఞకర్మలలో నొకదానినైన చేయనివానికి ఈ లో
కమున సౌఖ్యము గలుగదు. అటువంటివానికి పరలోక ప్రా
ప్తి ఎక్కడిది?

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధితాన్ సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే. 32

ఏవం- ఈ చెప్పబడిన ప్రకారముగా; బహువిధాః- నానా ప్రకారములయిన; యజ్ఞాః- యజ్ఞములు; బ్రహ్మణః- వేదము యొక్క; ముఖే-ద్వారమందు; వితతాః-విస్తీర్ణములయినవి; సర్వాన్- సమస్తములయిన; తాన్- ఆచెప్పబడినయజ్ఞములను; కర్మజాన్-కర్మములవలనబుట్టినవానినిగా; విద్ధి- తెలియుము; ఏవం- ఈప్రకారముగా; జ్ఞాత్వా- తెలిసి; మోక్ష్యసే-సంసార బంధమువలన విడువబడగలవు.

ఈపై జెప్పినవిధమున పలువిధములయిన యజ్ఞకర్మలు వేదమువల్ల విధింపబడినవి. ఆ యజ్ఞములన్నియు, కర్మరూపములనిఎఱుగుము. ఈ ప్రకారముగ తెలిసికొంటివేని నీవుసంసారబంధమునుండి తొలగినవాడ వగుచున్నావు.

శ్రేయాన్ ద్రవ్య మయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞఃపరంతప।
సర్వంకర్మా ఖిలంపార్థ జ్ఞానేపరి సమాప్యతే. 33

హే పరంతప- ఓయి అర్జునుడా; ద్రవ్యమయాత్- ద్రవ్య సాధనమయిన; యజ్ఞాత్- యజ్ఞమునకంటె; జ్ఞానయజ్ఞః- జ్ఞానస్వరూపమయినయజ్ఞము; శ్రేయాన్- మిక్కిలి శ్రేష్ఠమయినది హే పార్థ- ఓ అర్జునుడా; సర్వం-సమస్తమయిన; కర్మ-కర్మము; అఖిలంసత్- నాశనము కానిదగుచు; జ్ఞానే- బ్రహ్మజ్ఞానమందు; పరిసమాప్యతే- అంతర్భూతమగుచున్నది.

ఓ అర్జునా! ద్రవ్యసాధన సాధ్యమైన యజ్ఞముకంటె జ్ఞానస్వరూపమైన యజ్ఞము మిక్కిలి శ్రేష్ఠము. ఎల్లకర్మలు బ్రహ్మజ్ఞానమునందు లయించుచున్నది.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః. 34

తత్త్వదర్శినః- తత్త్వవిదులయిన; జ్ఞానినః-జ్ఞాననిష్ఠులు; తే- నీకొఱకు; యత్-ఏజ్ఞానమును; ఉపదేక్ష్యంతి- ఉపదేశింపగలరో; తత్- ఆజ్ఞానమును; ప్రణిపాతేన- సాష్టాంగ నమస్కారములచేత; పరిప్రశ్నేన- తెలియనివిషయముల నడుగుటచేత; సేవయా-గురుశుశ్రూషచేత; విద్ధి- తెలియుము;

ఇట్టి బ్రహ్మజ్ఞానమును తత్త్వవిదులయిన జ్ఞాననిష్ఠులను ఆశ్రయించి వారికి ఉపచారములుజేసి సాష్టాంగ దండప్రమాణంబులుజేసి, ప్రార్థనజేసి తెలిసికొనుము. వారు ఉపదేశము జేయుదురు.

యద్ జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాండవ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి. 35

హే పాండవ- ఓయి అర్జునుడా; యత్-ఏజ్ఞానమును; జ్ఞాత్వా- తెలిసి; పునః-తిరిగి; ఏవం-ఏతాదృశమైన; మోహం-మోహమును; నయాస్యసి-పొందవో; ఏన-ఏజ్ఞానముచేత; భూతా

ని-ప్రాణులను; అశేషేణ- నిశ్శేషముగా; ఆత్మని- నీయందే; ద్రక్ష్యసి-చూడగలవో; అథో-పిమ్మట; మయి- పరబ్రహ్మస్వరూపుడయిన నాయందు; ద్రక్ష్యసి- చూడగలవు;

ఓ అర్జునా! పరబ్రహ్మజ్ఞానమును పొందితివేని మరల నీకు ఇట్టి బుద్ధి మోహము కలుగదు. ఈపై జెప్పిన బ్రహ్మజ్ఞానము వలన ఎల్ల చరాచర భూతములను ఆత్మరూపమైన నాయందు చూడగలవు.

అపిచేదసి పాపేభ్య స్సర్వేభ్యః పాపకృత్తమః।
సర్వంజ్ఞాన ప్లవేనైవ వృజినంసంతరిష్యసి. 36

సర్వేభ్యః-సమస్తమయిన; పాపేభ్యః- పాపముచేసినవారి కంటె; పాపకృత్తమః- మిక్కిలి పాపముచేసినవాడవు; అపిచేదసి-అయితివేని; త్వం-నీవు; జ్ఞానప్లవేనైవ- జ్ఞానమనెడి తెప్ప చేతనే; సర్వం- సమస్తమయిన; వృజినం- పాపసముద్రమును; సంతరిష్యసి- లెస్సగా తరించగలవు.

పాపాత్ములలో నీవు మహాపాపివైనను పాపము నంతయు ఈ జ్ఞానమనెడి తెప్పచేత దాటగలవు.

యథైధాంసిసమిద్ధోఽగ్ని ర్భస్మసాత్కురుతేఽర్జున।
జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా. 37

హే అర్జున- ఓ అర్జునుడా; సమిద్ధః-లెస్సగా ప్రకాశించుచు

న్ను; అగ్నిః-అగ్నిహోత్రుడు, ఏధాంసి-కట్టెలను; యథా-ఏప్ర కారముగా; భస్మసాత్-భస్మముగా; కురుతే-చేయుచున్నాడో; తథా-ఆప్రకారముగా; జ్ఞానాగ్నిః-జ్ఞానము నెడుఅగ్ని; సర్వకర్మాణి సమస్తకర్మములను; భస్మసాత్కురుతే- భస్మము జేయుచున్నది.

ఓ అర్జునా! చక్కగా ప్రజ్వలించేనిప్పు దారువులను ఏ విధముగ భస్మము జేయుచున్నదో ఆ విధముగనే జ్ఞానమనే అగ్ని సమస్తకర్మలను భస్మము జేయుచున్నది.

నహిజ్ఞానేన సదృశం పవిత్ర మిహవిద్యతే।

తత్స్వయం యోగసంసిద్ధః కాలేనాత్మని విందతి. 38

ఇహ- ఈలోకమందు; జ్ఞానేన- జ్ఞానముతో; సదృశం-స మానమైన; పవిత్రం- పావనమైనది; నహివిద్యతే- లేదు; స్వయం-తాను, కాలేన-బహుకాలముచేత; యోగసంసిద్ధస్సన్- యోగా భ్యాసముచేత లెస్సగా సిద్ధుడైనవాడై; ఆత్మని- తన యందు; తత్- ఆజ్ఞానమును; విందతి-పొందుచున్నాడు.

ఈ లోకమందు జ్ఞానముకంటె యుత్తరపావనమైనది లేదు. ఆ జ్ఞానమును యోగసిద్ధుడు కాలాను గుణ్యముగా తానే తన యందు పొందుచున్నాడు.

శ్రద్ధావాన్ లభతేజ్ఞానం తత్పరస్సంయతేంద్రియః।

జ్ఞానంలబ్ధ్వా పరాంశాంతి మచిరేణాధిగచ్ఛతి. 39

శ్రద్ధావాన్ - విశ్వాసముగలిగిన; తత్పరః - తదాసక్తుడైన; సంయతేంద్రియః - ఇంద్రియ నిగ్రహముగల పురుషుడు; జ్ఞానం - జ్ఞానమును; లభతే - పొందుచున్నాడు; జ్ఞానం - జ్ఞానమును; లబ్ధ్వా - పొంది; పరాం - ఉత్కృష్టమైన; శాంతిం - చిత్తోపరతిని; అచిరేణ - శీఘ్రముగా; అధిగచ్ఛతి - పొందుచున్నాడు.

శ్రద్ధయు జ్ఞానాపేక్షయు ఇంద్రియ నిగ్రహముగల పురుషుడు జ్ఞానమునుపొందును. అట్లు జ్ఞానమును పొంది అతి శీఘ్రములో ఉత్కృష్టమైన చిత్తోపరతిని పొందును.

అజ్ఞశ్చా శ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి।
నాయంలోకో స్తి నపరో నసుఖం సంశయాత్మనః. 40

అజ్ఞశ్చ - తెలియనివాడును; అశ్రద్ధధానశ్చ - విశ్వాసము లేనివాడును; సంశయాత్మా - సంశయముతోగూడిన మనస్సుగలవాడును; వినశ్యతి - జెడిపోవుచున్నాడు; సంశయాత్మనః - సంశయ మనస్సుగలవానికి; అయంలోకః - ఈ సర్వప్రాణిసాధారణమయిన లోకము; పరశ్చ - పరలోకమును; నాస్తి - లేదు; సుఖం - సుఖమును; న - లేదు.

జ్ఞానములేని వాడున్ను, శ్రద్ధలేని వాడున్ను, సంశయాత్మ గలవాడున్ను చెడిపోవును. సంశయాత్మకునకు ఇహపర సుఖములు గలుగవు.

**యోగ సన్న్యస్త కర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్।**
**ఆత్మవంతంనకర్మాణి నిబధ్నంతి ధనంజయ.** 41

హే ధనంజయ- ఓ అర్జునుడా; యోగసన్న్యస్తకర్మాణం- యోగముచేత విడువబడిన సర్వకర్మములు గలిగిన; జ్ఞాన సంఛిన్నసంశయం- బ్రహ్మజ్ఞానముచేత ఛేదింపబడిన సందేహము కలిగినట్టి; ఆత్మవంతం- దృఢమనస్కుడయిన పురుషుని; కర్మాణి- పుణ్యపాపకర్మములు; ననిబధ్నంతి- బంధించవు.

ఓ ధనంజయ! యోగముచేత కర్మలు విడిచినవాడై జ్ఞానముచేత సంశయవిముక్తుడై దృఢమైన మనస్సుగల వాడయిన పురుషుని కర్మలు బంధించవు.

తస్మాదజ్ఞాన సంభూతం హృత్స్థంజ్ఞానాసి నాత్మనః।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠభారత. 42

హే భారత- ఓ అర్జునా; తస్మాత్- ఆ కారణము వలన; జ్ఞానాసినా- జ్ఞానమనెడిఖడ్గముచేత; అజ్ఞానసంభూతం- అవివేకములవలనబుట్టిన; హృత్స్థం- మనస్సునందున్న; ఆత్మనః- నీయొక్క; ఏనం సంశయం- యీ సందేహమును; ఛిత్త్వా- ఛేదించి; యోగం- ఆత్మజ్ఞానయోగమును; ఆతిష్ఠ- చేయుము; ఉత్తిష్ఠ- పరికృతమయిన యుద్ధమునకు లెమ్ము.

ఓ భారతా! అజ్ఞాన సంభూతమయిన నీ మనస్సులోని సం

శయమును జ్ఞానమనెడి ఖడ్గముచే ఖండించి యోగమును అను
ష్ఠింపుము, యుద్ధమునకు బయలుదేరుము.

ఇతి శ్రీ భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీ కృష్ణార్జున సంవాదే
జ్ఞానయోగో నామ చతుర్థోఽధ్యాయః.

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగ
శాస్త్రమును శ్రీ కృష్ణార్జునుల సంవాదరూపం
బయిన శ్రీ భగవద్గీతల యందు జ్ఞానయోగ
మనెడి చతుర్థోఽధ్యాయము ముగిసినది.

---

## శ్రీ భగవద్గీత.

కర్మసన్న్యాసయోగోనామ పంచమోఽధ్యాయః.

అర్జున ఉవాచ.

సన్న్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగంచ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం. 1

హే శ్రీకృష్ణ- ఓ శ్రీకృష్ణస్వామి; కర్మణాం- శాస్త్రీయ

ములయిన కర్మవిశేషముల యొక్క; సన్న్యాసం-పరిత్యాగము
ను; పునః-మరల, యోగంచ- శాస్త్రీయమయినకర్మయో
గమును; శంససి- చెప్పుచున్నావు; ఏతయోః- ఈ రెంటిలోప
ల; ఏకం-ఒకటయిన; యత్- ఏది; శ్రేయః-శ్రేష్ఠమో; తత్-
దానిని; మే-నాకు; సునిశ్చయం- లెస్సగా నిశ్చయమగు నట్లు;
బ్రూహి- చెప్పుము.

అర్జును డడుగుచున్నాడు.— ఓ కృష్ణా నీవు ఒకప్పుడు కర్మలను విడువుమనియు, మరియొకప్పుడు కర్మలను జేయుమనియు జెప్పుచున్నావు. ఈ రెంటిలో ఏది శ్రేష్ఠమో దానిని నిశ్చయించి నాకు జెప్పుము.

## శ్రీ భగవానువాచ.

సన్న్యాసః కర్మయోగశ్చ నిశ్శ్రేయసకరావుభౌ।
తయోస్తుకర్మ సన్న్యాసా త్కర్మ యోగో విశిష్యతే. 2

సన్న్యాసః - కర్మ పరిత్యాగమును, కర్మయోగశ్చ- కర్మానుష్ఠానమును, ఉభౌ-రెండును, నిశ్శ్రేయసకరౌ- మోక్షమును గలుగజేయునట్టివి; తయోః- ఆ రెంటిలోపల, కర్మసన్న్యాసాత్ - కర్మపరిత్యాగముకంటె; కర్మయోగస్తు- కర్మయోగమయినను; విశిష్యతే- శ్రేష్ఠమగుచున్నది.

భగవంతుఁడు చెప్పుచున్నాడు.— కర్మ పరిత్యాగమున్ను, కర్మానుష్ఠానమున్ను, ఈ రెండుమార్గములు మోక్ష సాధకములే అయినను ఈ రెండుమార్గములలో కర్మ పరిత్యాగము నకంటె కర్మానుష్ఠానము శ్రేష్ఠముగాయున్నది.

జ్ఞేయస్స నిత్య సన్యాసీ యోన ద్వేష్టినకాంక్షతి।
నిర్ద్వంద్వోహిమహాబాహో సుఖంబంధాత్ప్రముచ్యతే.

హే మహాబాహో— ఓయి అర్జునుఁడా; యః— ఏ కర్మ యోగి; న ద్వేష్టి— ద్వేషించడో; నకాంక్షతి—కోరడో; సః—వాడు; (నిత్య సన్యాసీ కర్మానుష్ఠాన కాలము నందును సన్యాసి యని), జ్ఞేయః— తెలియఁదగినవాడు; హి— ఏకారణము వలన, నిర్ద్వంద్వః— రాగ ద్వేషములు లేనివాడు; సుఖం— అనాయాసముగా; బంధాత్— సంసారబంధమువలన; ప్రముచ్యతే— విడువఁబడుచున్నాడో.

ఓ అర్జునా! ఎవనికి ద్వేషములేదో, ఎవనికి కోరికలులేవో ఆ కర్మయోగి నిత్యసన్యాసి, అతను అనాయాసముగా కర్మ బంధమునుండి విముక్తుఁడగుచున్నాడు.

సాంఖ్యయోగౌపృథగ్బాలాః ప్రవదంతిన పండితాః।
ఏకమప్యాస్థితస్సమ్య గుభయోర్విందతేఫలమ్. 4

బాలాః— మూఢులు; సాంఖ్యయోగౌ— కర్మసన్యాస కర్మ

యోగములను; పృథక్ - భిన్నములయినవని; ప్రవదంతి- చెప్పు చున్నారు. పండితాః-జ్ఞాననిష్ఠులు; నప్రవదంతి- చెప్పరు; ఉ భయోః- సాంఖ్యయోగములలోపల; ఏకం-ఒకదానిని; సమ్య క్- లెస్సగా; ఆస్థితోపి- ఆశ్రయించినవాడైనను; ఉభయోః- సాంఖ్యయోగములయొక్క; ఫలం-ఫలమును; విందతే- పొం దుచున్నాడు.

కర్మసన్యాసమైన సాంఖ్యమున్ను కర్మానుష్ఠానమైన యోగమున్ను ప్రత్యేకములని తెలియని వారు చెప్పుదురుగాని జ్ఞానులు చెప్పరు. ఈ రెంటిలో ఒకదానిని చక్కగా అభ్య సించినవానికి ఆ రెంటిఫలములు కలుగుచున్నవి.

యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతిసపశ్యతి. 5

సాంఖ్యైః-జ్ఞాననిష్ఠులచేత; యత్ స్థానం- ఏస్థానము; ప్రా ప్యతే-పొందబడుచున్నదో; యోగైరపి- కర్మయోగులచేత ను: తత్ -ఆస్థానము; గమ్యతే- పొందబడుచున్నది; (ఆ కా రణమువలన) యః-ఎవ్వాడు, సాంఖ్యంచ- జ్ఞానమును; యో గంచ-కర్మయోగమును; ఏకం- సమఫల మగదమయినదానిని గా; పశ్యతి- చూచుచున్నాడో; సః- వాడు; పశ్యతి- లెస్సగా తెలిసినవాడు.

సన్న్యాసముచేపొందు స్థానము కర్మచేతను పొందవచ్చును. ఎవడైతే సన్న్యాసమును కర్మను ఒకటిగా తెలియుచున్నాడో వాడే జ్ఞాని.

సన్న్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి. 6

హే మహాబాహో- ఓయి అర్జునుడా; సన్న్యాసస్తు- పారమార్థికమయితే; అయోగతః- కర్మయోగములేనందున; ఆప్తుం-పొందుటకొఱకు; దుఃఖం- దుఃఖహేతువయినది; యోగయుక్తః- కర్మయోగముతో గూడిన: మునిః- మననశీలుడు; నచిరేణ- శీఘ్రముగా; బ్రహ్మ-బ్రహ్మమును; అధిగచ్ఛతి- పొందుచున్నాడు.

ఓ అర్జునా! కర్మలేని సన్న్యాసమును పొందడము కష్టము. కర్మానుష్ఠానముగల జ్ఞాని త్వరలో బ్రహ్మమును పొందును.

యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి నలిప్యతే. 7

యోగయుక్తః- కర్మయోగయుక్తుడయినవాడును: విశుద్ధాత్మా- పరిశుద్ధమైనచిత్తముకలవాడును: విజితాత్మా- జయింపబడిన దేహముగలవాడును; జితేంద్రియః- గెలువబడిన ఇంద్రియములుకలిగినవాడును; సర్వభూతాత్మభూతాత్మా- స

మస్తమైన బ్రహ్మాది భూతములయొక్క స్వరూపమయిన ప్రత్యగాత్మ స్వరూపముగల పురుషుడు; కుర్వన్నపి- కర్మమును జేయుచున్నవాడయినను; నలిప్యతే- అంటబడడు.

కర్మయోగముచేయువాడు చిత్తశుద్ధిగలిగి మనస్సును స్వాధీనములోనుంచుకొని ఇంద్రియములనుజయించి సమస్త భూతములు తానుగాను తాను సమస్తభూతములుగాను ఎంచి కర్మలుచేసినా కర్మలచే కట్టుబడడు.

నైవకించిత్కరోమీతి యుక్తోమన్యేతతత్త్వవిత్।
పశ్యఞ్ఛృణ్వన్స్పృశఞ్జిఘ్రన్నశ్నన్గచ్ఛన్స్వపఞ్శ్వసన్.
ప్రలపన్విసృజన్గృహ్ణన్నున్మిషన్నిమిషన్నపి।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంతఇతిధారయన్. 8. 9.

తత్త్వవిత్- యథార్థమును దెలిసినవాడు; పశ్యన్- చూచుచు; శృణ్వన్-వినుచు; స్పృశన్-స్పృశించుచు; జిఘ్రన్- ఆఘ్రాణించుచు; అశ్నన్-భుజించుచు; గచ్ఛన్-నడుచుచు; స్వపన్- నిద్రించుచు; శ్వసన్-నిట్టూర్పు విడుచుచు. ప్రలపన్- పలుకుచు; విసృజన్-విడుచుచు; గృహ్ణన్- గ్రహించుచు, ఉన్మిషన్-కన్నులు తెరచుచు; నిమిషన్నపి- కన్నులు మూయుచున్నవాడయినను; ఇంద్రియాణి- శ్రోత్రాదీంద్రియములు; ఇంద్రియార్థేషు-విషయములయందు; వర్తంతఇతి- ప్రవర్తించు

చున్నవని; ధారయన్- నిశ్చయించినవాడగుచు; కించిత్ -యించుకయైనను; నకరోమ్యేవేతి- నేను జేయ లేదని; యుక్తస్సన్- సమాహిత చిత్తుండగుచు; మన్యేత- తలచును: అని రెండుశ్లోకములకు నేకాన్వయము.

బ్రహ్మజ్ఞాని, కండ్లతో చూచును, చెవులతో వినును దేహముచేత తాకుచు, ముక్కుచేత వాసన చూచుచు, జిహ్వచేత తినుచు, కాళ్ళచేత నడచుచు, నిద్రించుచు, శ్వాసనిశ్వాసములు విడుచుచు, మాటలాడుచు, మూత్రపురీషములను విడుచుచు, విషయములను అంగీకరించుచు, కన్నులు మూయుచు, దెరచుచు, ఇంద్రియములు ఇంద్రియ విషయముల యందు ప్రవర్తించుచున్నవే గాని, పరబ్రహ్మమైన తాను, ఏమియు చేయలేదని, చిత్తశుద్ధిగలిగి తలచును.

బ్రహ్మణ్యాధాయకర్మాణి సంగంత్యక్త్వాకరోతియః।
లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా. 10

యః- ఎవ్వడు; కర్మాణి- సమస్తకర్మములను: బ్రహ్మణి- పరమాత్మయందు. ఆధాయ-ఉంచి: సంగం-ఆసక్తిని; త్యక్త్వా- విడిచి; కరోతి- చేయుచున్నాడో; సః-వాడు. అంభసా- ఉదకముచేత; పద్మపత్రమివ- తామరపాకువలె: పాపేన-పాపముచేత; నలిప్యతే-అంటబడడు,

ఎవఁడైతే కర్మలను బ్రహ్మార్పణముచేసి ఆసక్తి విడిచి వానిని అనుష్ఠించుచున్నాఁడో అట్టి పురుషుడు తామరాకును నీళ్లు అంటనిరీతిగా పాపముచేత స్పృశింపఁబడఁడు.

కాయేనమనసాబుద్ధ్యా కేవలైరింద్రియైరపి।

యోగినఃకర్మకుర్వంతి సంగంత్యక్త్వాత్మశుద్ధయే. 11

యోగినః- కర్మయోగులు; ఆత్మశుద్ధయే- చిత్తశుద్ధికొరకు; సంగం-ఫలాసక్తిని; త్యక్త్వా-విడిచి, కాయేన- శరీరముచేత; కర్మ- స్నానాదికర్మమును; మనసా-మనసుచేత ధ్యానాది కర్మమును; బుద్ధ్యా-బుద్ధిచేత నిశ్చయాదికర్మమును; కేవలైః- కేవలములయిన; ఇంద్రియైరపి- ఇంద్రియములచేత శ్రవణాదికర్మమును; కుర్వంతి-చేయుచున్నారు.

కర్మయోగులు చిత్తశుద్ధికొరకు ఫలాసక్తిలేకనే శరీరముచేతను మనస్సుచేతను బుద్ధిచేతను మమతాశూన్యమైన ఇంద్రియములచేతను కర్మలు చేయుచున్నారు.

యుక్తఃకర్మఫలంత్యక్త్వా శాంతిమాప్నోతినైష్ఠికీమ్।

అయుక్తఃకామకారేణ ఫలేసక్తోనిబధ్యతే. 12

యుక్తః-సమాహితచిత్తుడు; కర్మఫలం-కర్మఫలమును; త్యక్త్వా-విడిచి; నైష్ఠికీం-నిష్ఠయందుబుట్టిన; శాంతిం- శాంతిని; ఆప్నోతి-పొందుచున్నాడు; అయుక్తః- సమాహితచిత్తుడుకాని

వాఁడు; కామకారేణ- కోరికచేత; ఫలే- కర్మఫలమందు; సక్తః- ఆసక్తుఁడయినవాఁడై; నిబధ్యతే- కట్టఁబడుచున్నాఁడు.

ఫలాపేక్షవదలి కర్మలు చేయువాఁడు పారమార్థికమైన చిత్తశాంతిని బొందుచున్నాఁడు. యోగికానివాఁడు కామప్రేరేపణచేత కర్మలు చేసి బద్ధుఁడగుచున్నాఁడు.

సర్వకర్మాణిమనసాసన్న్యస్యాస్తేసుఖంవశీ।
నవద్వారేపురేదేహే నైవకుర్వన్న కారయన్. 13

వశీ- ఇంద్రియనిగ్రహము గలవాఁడు; మనసా- మనస్సుచేత; సర్వకర్మాణి- సమస్తకర్మములను; నవద్వారే- శ్రోత్రాదిద్వారములుగలిగిన; పురే- పట్టణమువంటి; దేహే- దేహమందు; సన్న్యస్య- విడిచిపెట్టి; నైవకుర్వన్- చేయనివాఁడై; నకారయన్- చేయించనివాఁడై; సుఖం- అనాయాసముగా; ఆస్తే- ఉన్నాఁడు;

ఇంద్రియ నిగ్రహము గలవాఁడు మనస్సుచేత సమస్తకర్మలను వదలిపెట్టి నవద్వారములుగల పట్టణమనే దేహమునందు తాను కర్మచేయనివాఁడై మఱియొకరిచేత చేయించనివాఁడై అనాయాసముగా నుండును;

నకర్తృత్వంనకర్మాణి లోకస్య సృజతిప్రభుః।
నకర్మఫలసంయోగం స్వభావస్తుప్రవర్తతే. 14

ప్రభుః- ఆత్మ; లోకస్య- జనునికి; కర్తృత్వం- కర్తృత్వము

నః; నసృజతి–కలుగజేయడు; కర్మాణి– కర్మములను, నసృజ
తి–సృజించడు, కర్మఫలసంయోగంచ– కర్మఫలాసక్తిని; నసృ
జతి–సృజించడు (మరియేమున్నను) స్వభావః– మాయ; ప్ర
వర్తతే– ప్రవర్తించుచున్నది.

ఈశ్వరుడు కర్తృత్వమును బుట్టించలేదు కర్మలను బుట్టిం
చలేదు. కర్మ ఫల సంబంధమును గలుగజేయలేదు. అన్నియు
ప్రకృతివల్ల గలిగినది.

నాదత్తే కస్యచిత్పాపం న చైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః. 15

విభుః–ఆత్మ; కస్యచిత్– ఒకానొక జంతువుయొక్క; పాపం–
పాపమును; సుకృతంచ–పుణ్యమును, నైవ– గ్రహించ
డు; అజ్ఞానేన–అజ్ఞానముచేత; జ్ఞానం–వివేకజ్ఞానము, ఆవృతం–
కప్పబడెను; తేన–ఆయజ్ఞానముచేత. జంతవః– అవివేకులయి
నసంసారులు; ముహ్యంతి– మోహమునొందుచున్నారు.

ఈశ్వరుడు పురుషులయొక్క పాపమును గాని పుణ్యమును
గాని గ్రహించడు. జ్ఞానమును అజ్ఞానముగప్పియున్నది, గనుక
పురుషులు కర్తృత్వాద్యభిమానముచేత మోహమును బొం
దుచున్నారు.

జ్ఞానేనతుతదజ్ఞానం యేషాంనాశితమాత్మనః।
తేషామాదిత్యవజ్జ్ఞానం ప్రకాశయతితత్పరమ్. 16.

ఆత్మనః-పరమాత్మయొక్క; జ్ఞానేన-వివేకజ్ఞానముచేత; యేషాం-ఏజంతువులయొక్క; తదజ్ఞానం-అయజ్ఞానము; నాశితం-నశింపజేయబడెనో; తేషాం-వారియొక్క; జ్ఞానం-జ్ఞానము; ఆదిత్యవత్-సూర్యునివలెనే; తత్పరం-అజ్ఞానమునకుపరమయిన పరమార్థతత్వమును; ప్రకాశయతి-ప్రకాశింపఁజేయుచున్నది.

ఎవ్వరికైతే తమ అజ్ఞానము జ్ఞానముచేత నశింపఁబడినదో వారికి జ్ఞానము సూర్యునివలె పరమాత్మను స్పష్టముగా నగుపరచుచున్నది.

తద్బుద్ధయస్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః।
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః. 17

జ్ఞాననిర్ధూతకల్మషాః-జ్ఞానముచేత పోఁగొట్టబడిన పాపములుగలిగినవారలు, తద్బుద్ధయస్సంతః-ఆబ్రహ్మమందే బుద్ధిగలవారలగుచు; తదాత్మానః- ఆ పరబ్రహ్మమే యాత్మస్వరూపముగాగలవారలయి; తన్నిష్ఠాః-ఆబ్రహ్మమందేయభినివేశము కలవారలయి; తత్పరాయణాః-ఆబ్రహ్మమేయుత్కృష్టగతిగాగలవారలయి; అపునరావృత్తిం-పునరావృత్తిరహితమయినమోక్షమును; గచ్ఛతి-పొందుచున్నారు.

పాపములను జ్ఞానముచే నశింపజేసినవారు పరబ్రహ్మమునం దే బుద్ధిగలవారై అదే ఆత్మస్వరూపముగా గలవారై అందే అభినివేశము గలవారై అదేఉత్కృష్టగతియని నిశ్చయించిన వారై పునరావర్తిరహితమైన మోక్షమునుబొందుచున్నారు.

విద్యావినయసంపన్నే బ్రాహ్మణేగవిహస్తిని।
శునిచైవశ్వపాకేచ పండితాస్సమదర్శినః. 18

విద్యావినయసంపన్నే- విద్యావినయములతో గూడిన; బ్రాహ్మణే- బ్రాహ్మణునియందును; గవి- ఆవులయందును; హస్తిని- ఏనుగులయందును; శునిచైవ- కుక్కయందును; శ్వపాకేచ- దానివండుకొని తినునట్టి చండాలునియందును; సమదర్శినః- సమానదృష్టిగలవారలు; పండితాః- జ్ఞానులు.

జ్ఞానులు విద్యావినయములతో గూడిన బ్రాహ్మణునియందును గోవునందును ఏనుగయందును శునకమందును దానివండి భక్షించువానియందును ఐక్యానుసంధానముజేసి సమానదృష్టిగలవారగుదురు.

ఇహైవతైర్జితస్సర్గో యేషాంసామ్యేస్థితంమనః।
నిర్దోషంహిసమంబ్రహ్మ తస్మాద్బ్రహ్మణితేస్థితాః. 19

ఏషాం- ఎవరియొక్క; మనః- అంతఃకరణము; సామ్యే- బ్రహ్మభావమందు; స్థితం- నిశ్చలమైయున్నదో; తైః- వారిచేత;

ఇహైవ- ఈలోకమందే; సర్గః-జన్మసంసారము; జితః- జయింపబడెను; హి-ఏ కారణమువలన; సమం- ఏకమయిన; బ్రహ్మ-బ్రహ్మము; నిర్దోషం-దోషరహితమయినదో; తస్మాత్-ఆకారణమువలన; తే-ఆసమదర్శకులు; బ్రహ్మణి-బ్రహ్మమందు; స్థితాః-ఉన్నవారలు.

ఎవరియొక్క మనస్సు సమస్తమునందు సమదృష్టిని బొందుచున్నదో వారిచేతను ఈ జన్మమునందే మోక్షము జయింపబడినది. ఏకారణమువల్ల నీబ్రహ్మము ఏకమై నిర్దోషమైయున్నదో ఆకారణమువల్ల సమదృష్టి గలవారు ఆ బ్రహ్మమందున్నవారు.

న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజేత్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధిరసమ్మూఢో బ్రహ్మవిద్బ్రహ్మణి స్థితః. 20

స్థిరబుద్ధిః- నిస్సంశయబుద్ధిగలిగిన; అసమ్మూఢః- మోహవర్జితుడయిన; బ్రహ్మవిత్-ఆత్మజ్ఞాని; బ్రహ్మణి - బ్రహ్మమందు;స్థితస్సన్-ఉన్నవాడగుచు; ప్రియం- ప్రియమును; ప్రాప్య-పొంది; నప్రహృష్యేత్-సంతోషించడు; అప్రియంచ-అనిష్టమును; ప్రాప్య-పొంది; నోద్విజేత్-భయపడడు.

బ్రహ్మమందున్న బ్రహ్మవిత్తు భ్రమవదలి స్థిరబుద్ధిగలవాడై ఇష్టమును బొందినపుడు సంతోషింపడు అనిష్టమును బొందిన

ఘాడు దుఃఖించడు.

శ్లో॥ బాహ్యస్పర్శేష్వసక్తాత్మా విందత్యాత్మని యత్సుఖమ్।
సబ్రహ్మయోగయుక్తాత్మా సుఖమక్షయమశ్నుతే. 21

యః-ఎవ్వడు; బాహ్యస్పర్శేషు-బయటబుట్టినశబ్దాదివిషయములయందు; అసక్తాత్మా - అంటనియంతఃకరణముకలవాడై, ఆత్మని-చిత్తవృత్తియందు; యత్సుఖం-ఏసుఖమును; విందతి-పొందుచున్నాడో; సః-వాడు; బ్రహ్మయోగయుక్తాత్మా సన్ - బ్రహ్మమందు నిర్మలమైన యంతఃకరణము గలవాడగుచు; అక్షయం-నాశరహితమైన; సుఖం-సుఖమును; అశ్నుతే-పొందుచున్నాడు.

శబ్దాదులైన ఇంద్రియవిషయముల యందు యే సుఖమును యోగి అనుభవించుచున్నాడో ఆసుఖముచే పరబ్రహ్మము నందున్ను అనుభవించుచున్నాడు.

యేహిసంస్పర్శజాభోగా దుఃఖయోనయఏవతే।
ఆద్యంతవంతః కౌంతేయ నతేషురమతే బుధః. 22

హే కౌంతేయ-ఓయి అర్జునుఁడ; సంస్పర్శజాః- విషయేంద్రియములవలనబుట్టిన; యేభోగాః- ఏసుఖములు; ఆద్యంతవంతః- విషయేంద్రియ సంయోగ వియోగములుగలిగినవో; తే-ఆవిషయభోగములు; దుఃఖయోనయఏవ- దుఃఖమునకు గార

ణములు యున వే; (ఆకారణమువలన) బుధః— తత్త్వజ్ఞుడు; తేషు— అవిషయభోగములయందు; నరమతే— ఆనక్తుడుకాడుగదా.

ఓ అర్జునా! విషయేంద్రియముల వలన పుట్టు సుఖములు ఆద్యంతములు గలవి గనుక, అసుఖములను దుఃఖకారణముగా ఎఱుంగుము. అందువల్ల పెద్దలు ఆ విషయ సుఖములలో అనక్తిఁజెందరు.

శక్నోతీహైవయస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం సయుక్తస్ససుఖీ నరః. 23

యః—ఎవ్వడు; శరీరవిమోక్షణాత్— దేహమువిడుచుటకంటె; ప్రాక్—ముందు; ఇహైవ— ఈలోకమందే; కామక్రోధోద్భవం— కామక్రోధమువలనబుట్టిన; వేగం— వేగము; సోఢుం— సహించుటకొఱకు; శక్నోతి—సమర్థుడగుచున్నాడో; స నరః—ఆ మనుష్యుడు; యుక్తః—ఇంద్రియనిగ్రహముగలవాడును; సుఖీ— సుఖముగలవాడును.

ఎవడు ఈ దేహమును వదలుటకు మున్నె కామక్రోధలోభమోహ మద మాత్సర్యముల వలన బుట్టిన అనేకమును జయించ సమర్థుడగునో, అట్టివాడే యోగి, అతడే బ్రహ్మానంద సుఖమును అనుభవించువాడు.

యోఽంతస్సుఖోఽంతరారామ స్తథాంతర్జ్యోతిరేవయః।
సయోగీబ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి.    24

అంతస్సుఖః- అంతరాత్మయందు సుఖము గల వాడును; అంతరారామః- ఆత్మారాముడును; యః- ఎవ్వడో; తథా-ఆలాగుననే; అంతర్జ్యోతిః- అంతః ప్రకాశముగలవాడును; యః- ఎవ్వడో; సయోగీ-ఆయోగి; బ్రహ్మభూతస్సన్-బ్రహ్మస్వరూపుడయినవాడయి; బ్రహ్మనిర్వాణం- బ్రహ్మానందమును; గచ్ఛతి- పొందుచున్నాడు.

ఎవడు ఆత్మసుఖుడై ఆత్మారాముడై జ్ఞానస్వరూపియై అంతః ప్రకాశుడైయుండునో ఆయోగి బ్రహ్మస్వరూపియై మోక్షమును పొందుచున్నాడు.

లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః.    25

క్షీణకల్మషా - నశించిన పాపములుకలవారును; ఛిన్నద్వైధాః-ఛేదింపబడిన సంశయములు గలవారును; యతాత్మానః- నిగ్రహింపబడిన చిత్తములుగలిగినవారును; సర్వభూతహితే- సమస్త ప్రాణిహితమందు; రతాః- ఆసక్తులయినవారునునైన; ఋషయః- జ్ఞాననిష్ఠులు; బ్రహ్మనిర్వాణం- మోక్షమును; లభంతే- పొందుచున్నారు.

గొప్పఋషులు పాపవర్జితులై నిస్సంశయాత్ములై ఇంద్రియనిగ్రహముగలవారయి సర్వ జీవకోట్లకు సుఖము చేయుటయందు ఆసక్తిగలవారయి మోక్షమును పొందుచున్నారు.

కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్. 26

కామక్రోధవియుక్తానాం- కామక్రోధములచేత విడువబడిన; యతచేతసాం- నియమింపబడిన యంతఃకరణము గలిగిన; విదితాత్మనాం- తెలియబడిన పరమాత్మస్వరూపము గలిగిన; యతీనాం-యతులకు, అభితః- ఇహపరాదులయందంతటను; బ్రహ్మనిర్వాణం-బ్రహ్మానందము; వర్తతే-వున్నది.

జితేంద్రియులుగా, యతీశ్వరులుగా, చలింపని చిత్తులుగా ఉండు ఆత్మజ్ఞానులకు మోక్షసుఖము అంతటయున్నయది.

స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాంశ్చక్షుశ్చైవాంతరే భ్రువోః
ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ. 27
యతేంద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యస్సదా ముక్త ఏవ సః. 28

యః-ఎవ్వడు; బాహ్యాన్- బహిర్భవములయిన శ్రోత్రాది ద్వారములచేత బుద్ధియందు ప్రవేశింపబడిన; స్పర్శాన్-శబ్దాదివిషయములను; బహిః-వెలుపటను; కృత్వా- చేసి; చక్షుః-

దృష్టిని; భ్రువోః-కనుబొమల యొక్క; అంతరే-మధ్యమందు; కృత్వా-చేసి; ప్రాణాపానౌ- ప్రాణాపానవాయువులను, నాసాభ్యంతరచారిణౌ- నాసికలోపల సంచరించెడివానిగా; సమౌ- సమానములుగా; కృత్వా-చేసి; యతేంద్రియమనోబుద్ధిః- నియమింపబడిన ఇంద్రియములును మనస్సు బుద్ధిగలవాడయి; విగతేచ్ఛాభయక్రోధః- పోగొట్టబడిన ఇచ్ఛయును భయమును క్రోధమును గలిగినవాడయి; మోక్షపరాయణః- మోక్షాసక్తుడయినవాడయి; మునిః-మననశీలుడయి; యః ఏషః- పున్నాడో; సః- ఆపురుషుడు; సదా- నిత్యమును; ముక్త ఏవ- ముక్తుడే.

ఎవడు శబ్దస్పర్శరూప రసగంధ విషయములను ఇంద్రియ సక్తనములకు వెలిజేసి దృష్టిని భ్రూమధ్యమునందు నిలిపి ప్రాణాపాన వాయువులను నాసికములద్వారా సమమైన శ్వాస నిశ్వాసములుగాజేసి ఇంద్రియములను మనస్సును బుద్ధిని అధీనము జేసికొని కోరిక భయము క్రోధములను జయించి మోక్షాసక్తుడై యుండునో అట్టివాడే ముక్తుడని తెలియుము.

భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి.

యజ్ఞతపసాం- యజ్ఞములకును తపస్సులకును; భోక్తారం-

దేవతారూపము చేతభోక్తయైన; సర్వలోకమహేశ్వరం- సమస్తలోకములకు నియామకుడయిన; సర్వభూతానాం- సమస్తప్రాణులకును; సుహృదం-ఉపకారియైన; మాం- నన్ను; జ్ఞాత్వా-తెలిసికొని; శాంతిం-సంసారోపరతిని; ఋచ్ఛతి-పొందుచున్నాడు.

మహనీయుడు నన్ను ఎల్ల యజ్ఞతపస్సులను అనుభవించువాడనియు ఎల్లప్రపంచములకు నియామకుడనియు ఎల్ల చరాచరభూతములకు ఉపకారియనియు తెలిసి మోక్షమును బొందుచున్నాడు.

ఇతి శ్రీ భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున సంవాదే కర్మసన్న్యాసయోగోనామ పంచమోధ్యాయః.

ఉపనిషద్రూపములును, బ్రహ్మవిద్యయును, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జునుల సంవాదరూపంబయిన కర్మ సన్న్యాస యోగమనెడి పంచమాధ్యాయము ముగిసినది.

## శ్రీ భగవద్గీతలు.

## ఆత్మసంయమ యోగోనామ షష్ఠోధ్యాయః.

### శ్రీ భగవానువాచ.

అనాశ్రితఃకర్మఫలం కార్యంకర్మకరోతియః।
ససన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః. 1

యః- ఎవ్వఁడు; కర్మఫల- కర్మముయొక్క- ఫలమును; అనాశ్రితస్సన్- అపేక్షించని వాఁడగుచు; కార్యం- చేయదగిన; కర్మ- కర్మమును; కరోతి- చేయుచున్నాడో. సః- వాఁడు; సన్న్యాసీచ- కర్మపరిత్యాగము కలవాఁడును; యోగీచ- చిత్తసమాధానము కలవాడును; భవతి- అగుచున్నాడు; నిరగ్నిః- పోయినయగ్నులు కలవాడును; న- కాదు; అక్రియశ్చ- తపోదానాది క్రియలులేనివాడును; న- కాదు.

ఏ మనుజుడు కర్మఫలాపేక్షలేక చేయతగ్గ కర్మలనుచేయుచున్నాడో అతడు కర్మవదలిన సన్న్యాసియు, చిత్తశుద్ధికలిగిన యోగియు అగుచున్నాడు. అతను యోగశాస్త్రసమ్మతముగా అగ్నిహోత్రదానాది కర్మలను వదలిన యోగికంటె అధికుడు.

యంసన్న్యాసమితిప్రాహుర్యోగంతంవిద్ధిపాండవ।
నహ్యసన్న్యస్తసంకల్పో యోగీభవతి కశ్చన. 2

హేపాండవ- ఓ అర్జునుడా; బుధాః-జ్ఞాననిష్ఠులు; యం- దేనిని; సన్న్యాసమితి- సర్వకర్మ పరిత్యాగలక్షణముగలదానినిగా; ప్రాహుః-చెప్పుదురో; తం- దానిని; యోగమితి- కర్మానుష్ఠానలక్షణముగ, విద్ధి- తెలియుము; హి-ఏకారణమువలన; అసన్న్యస్తసంకల్పః- విడువబడని ఫలవిషయ సంకల్పముగలిగిన; కశ్చన-ఒకానొకడును, యోగీ- కర్మయోగి; నభవతి- కాడో.

ఓ అర్జునా! సన్న్యాసమని దేనిని చెప్పుచున్నారో దానినే కర్మయోగమని యెఱుంగుము. సంకల్పత్యాగము చేయని వాడు యోగి కాజాలడు.

ఆరురుక్షోర్మునేర్యోగం కర్మకారణముచ్యతే।
యోగారూఢస్యతస్యైవ శమఃకారణముచ్యతే. 3

యోగం- జ్ఞాన యోగమును; ఆరురుక్షోః- ఎక్క నిశ్చయించిన; మునేః- మునికి; కర్మ- కర్మము; కారణం- సాధనమని; ఉచ్యతే- చెప్పబడుచున్నది; యోగారూఢస్య- జ్ఞానము నెక్కిన; తస్యైవ- ఆమునికే; శమః- సర్వకర్మనివృత్తి; కారణం-సాధనము; ఉచ్యతే- చెప్పబడుచున్నది.

జ్ఞానయోగమును బొందఁగోరిన మునులకు ఫలత్యాగపూర్వ కకర్మ సాధనముగా నున్నది. జ్ఞానము గలిగిన వెనుక కర్మనివృత్తి యనెడి కర్మనే సాధనముగ దెలియుము.

యదాహి నేంద్రియార్థేషు నకర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసన్న్యాసీ యోగారూఢస్తదోచ్యతే. 4

**యదా**-ఎప్పుడు; ఇంద్రియార్థేషు- శబ్దాదివిషయములయందు; నానుషజ్జతే- -ఆసక్తుఁడు కాఁడో, కర్మసు- కర్మములయందును; నానుషజ్జతే-ఆసక్తుఁడు కాఁడో, తదా-అప్పుడు; సర్వసంకల్పసన్న్యాసీ- సమస్తసంకల్పముల పరిత్యజించు నట్టిశీలము గలవాఁడు; యోగారూఢః- జ్ఞానమును బొందినవాఁడని; ఉచ్యతే- చెప్పఁబడుచున్నాఁడు.

ఎప్పుడు శబ్దస్పర్శరూపరసగంధ విషయములయందును, నిత్యనైమిత్తికాది కర్మలయందును ఆసక్తుఁడు గాకయుండునో అప్పుడు సమస్తసంకల్పములను విడిచినవాఁడై జ్ఞానము నొందినవాఁడని చెప్పఁబడుచున్నాఁడు.

ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్।
ఆత్మైవహ్యాత్మనోబంధు రాత్మైవరిపురాత్మనః. 5

ఆత్మనా- ఆసక్తిలేనిమనస్సుచేత; ఆత్మానం-సంసారసాగరమగ్నుఁడయినతన్ను; ఉద్ధరేత్- ఉద్ధరింపవలయు; ఆత్మానం-

తన్ను; నావసాదయేత్ - అధోగతిని పొందించగూడదు; హిం-సకారణమువలన; ఆత్మనః- తనకు; ఆత్మైవ- వశీకృతమైన మనస్సే; బంధుః- బంధువు; ఆత్మనః- తనకు; ఆత్మైవ- వశీకృతముకానిమనస్సే; రిపుః-శత్రువు.

పురుషుడు తాను తనమనస్సుచే ఉద్ధరించుకొనవలయును. తాను చెడుపుకొనరాదు. తనకు మనసే, బంధువు, మనస్సే శత్రువు.

బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనాజితః।
అనాత్మనస్తుశత్రుత్వే వర్తేతాత్మైవశత్రువత్. 6

యేనైవాత్మనా- ఏ మనస్సుచేతనే; ఆత్మా- దేహేంద్రియాది సంఘాతము; జితః- జయింపబడునో; తస్యాత్మనః-ఈ మనస్సుకు- ఆత్మా దేహేంద్రియాది సంఘాతము; బంధుః- బంధువు; అనాత్మనస్తు- జయింపబడనిమనస్సుగలవానికైతే; ఆత్మా-మనస్సు; శత్రువత్- శత్రువువలె; శత్రుత్వే- శత్రుభావమయిన అపకారమందు; వర్తేత- ఉండును.

ఎవడు తన మనస్సుచేత దేహేంద్రియాది సమూహమును జయించుచున్నాడో అట్టివానికి తన మనస్సు ఉపకారియగును ఆ యింద్రియజయము లేనివానికి మనస్సు శత్రువుగానుండును.

**జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః।**
**శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః. 7**

**జితాత్మనః**- జయింపబడినమనస్సుగల; ప్రశాంతస్య- ఉపశాంతుడయినపురుషునికి; పరం- మిక్కిలి; ఆత్మా- మనస్సు; శీతోష్ణసుఖదుఃఖేషు- శీతోష్ణాది సుఖదుఃఖముల యందును; తథా- అలాగుననే; మానావమానయోః- పూజానిందలయందును; సమాహితః- ఆత్మానుభవమందే యుండును,

జితేంద్రియుడై ఉపశాంతిని పొందినవాడు **పరమాత్మస్వ**రూపుడై శీతోష్ణముల యందును సుఖ దుఃఖముల **యందును** మానావమానముల యందును సముడై సుఖించు **చుండును.**

జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః।
**యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః. 8**

**జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా**- శాస్త్రోక్త జ్ఞానముచేత నాత్మానుభవజ్ఞానముచేత తృప్తమైనమనస్సుగలవాడును; కూటస్థః- చలింపనశక్యుడయిన; విజితేంద్రియః- ఇంద్రియ నిగ్రహముగలవాడును; **సమలోష్టాశ్మ** కాంచనః- సమానములయిన పెంకు రాయి బంగారు ఈమూడును గలిగినవాడును నైన: **యోగీ**- జ్ఞాని; **యుక్త ఇతి**- ఆత్మానుభవము కలవాడని; **ఉచ్యతే**- చెప్పబడుచున్నాడు.

శాస్త్రీయ జ్ఞానముచేతను అనుభవ జ్ఞానముచేతను పరితృప్తిపొందిన మనసుగలవాడు సమదర్శియై ఇంద్రియనిగ్రహముగలిగి మట్టి రాయి బంగారములయందు సమబుద్ధికలిగిన యోగియై ఆత్మానుభవజ్ఞానముగలవాడని చెప్పబడును.

సుహృన్మిత్రార్యుదాసీన మధ్యస్థద్వేష్యబంధుషు।
సాధుష్వపిచపాపేషు సమబుద్ధిర్విశిష్యతే. 9

సుహృత్-ఉపకారముచేసినవానియందు; మిత్ర-అవ్యాజస్నేహితునియందు; అరి-శత్రువునందు; ఉదాసీన-పక్షపాతములేనివానియందు; మధ్యస్థ-మధ్యస్థునియందు; ద్వేష్య-తనతోవిరోధించిన వానియందు; బంధుషు- బంధువులయందు; సాధుషు-సత్పురుషులయందు; పాపేషు- పాపాత్ములయందు; సమబుద్ధిః- సమమయిన బుద్ధిగలవాడు; విశిష్యతే- యోగారూఢుడగుచున్నాడు.

మంచి చేయువారియందును, స్నేహితులయందును, శత్రువులయందును, ఉదాసీనులయందును, మధ్యవర్తుల యందును, బంధువులయందును, సత్పురుషులయందును, పాపాత్ములయందును, సమబుద్ధిగలవాడు యోగారూఢశ్రేష్ఠుడని చెప్పబడును.

యోగీయుంజీతసతత మాత్మానంరహసిస్థితః।
ఏకాకీయతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః. 10

యోగీ- యాత్మధ్యానముగలవాడు; ఏకాకీ- సహాయములే నివాడయి; యతచిత్తాత్మా- నియమింపబడిన మనస్సును దేహమునుగలవాడయి; నిరాశీః-పోయినయాశగలవాడయి; అపరిగ్రహః- పరిగ్రహము లేనివాడయి, రహసి-ఏకాంతమందు; స్థితః-ఉన్నవాడయి; ఆత్మానం-అంతఃకరణమును; సతతం- ఎల్లప్పుడును; యుంజీత- నిగ్రహించవలయు.

ఆత్మధ్యానముగలయోగి నిశ్చలు మనస్సు దేహముగలవాడయి కోరికలు లేనివాడయి పరిగ్రహ శూన్యుడయి ఒంటరిగా రహస్యప్రదేశమునందు నివసించి మనస్సును నిగ్రహింప వలయును.

శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః।
నాత్యుచ్ఛ్రితంనాతినీచం చేలాజినకుశోత్తరమ్. 11

శుచౌ-పరిశుద్ధమైన; దేశే-స్థానమందు; నాత్యుచ్ఛ్రితం-మిక్కిలి హెచ్చుగాని; నాతినీచం-మిక్కిలితక్కువగాని; చేలాజినకుశోత్తరం-వస్త్రచర్మదర్భలుమీదుగాగలిగిన; ఆత్మనః-తనకు; ఆసనం-ఆస్తరణమును; స్థిరం-నిశ్చలముగునట్లు; ప్రతిష్ఠాప్య-ఉంచి.

మరీ ఎత్తుగానటువంటిన్ని, మరీ పల్లముగానటువంటిన్ని, పరిశుద్ధమైన సమస్థలమున మొదట దర్భాసనముపిదప కృష్ణా

జినము, వెనుక వస్త్రాసనము ఉంచవలయును.

తత్రైకాగ్రం మనఃకృత్వా యతచిత్తేంద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగమాత్మవిశుద్ధయే. 12

తత్ర- ఆ; ఆసనే- స్థిరాసనమందు; ఉపవిశ్య- కూర్చుండి; మనః-మనస్సును; ఏకాగ్రం-నిశ్చలముగా; కృత్వా-చేసి; యతచిత్తేంద్రియక్రియః- నియమింపబడిన చిత్తేంద్రియ వ్యాపారములుకలిగిన; యోగీ-యోగాభ్యాసకుడు; ఆత్మవిశుద్ధయే- అంతఃకరణ పరిశుద్ధికొఱకు; యోగం- యోగమును; యుంజ్యాత్- అభ్యసించవలెను.

తర్వాత, ఆయాసనమునందు నిశ్చయబుద్ధితో కూర్చుని, చిత్తమును స్థిరముగా నిలిపి, ఇంద్రియవ్యాపారములను నిగ్రహించి యోగాభ్యాసకుడు మనశ్శుద్ధికొఱకు, యోగము మొదలు పెట్టవలయును.

సమం కాయశిరోగ్రీవం ధారయన్నచలంస్థిరః।
సంప్రేక్ష్యనాసికాగ్రంస్వం దిశశ్చానవలోకయన్. 13

అచలం- నిశ్చలముగా; సమం-సమానముగా; కాయశిరోగ్రీవం- శరీర శిరఃకంఠములను; ధారయన్- ధరించుచున్నవాడయి; స్థిరః-స్థిరుడయినవాడయి; స్వయం-స్వకీయమైన; నాసికాగ్రం-నాసికాగ్రమును; సంప్రేక్ష్య-చూచి; దిశః- దిక్కుల

ను; అనవేక్షలోకయన్ - చూడనివాడయి.

తన దేహమును, మెడను, శిరమును చక్కగానిలిపి, స్థిరచిత్తుడయి, దిశలుచూడక, తన కొనముక్కుమీద, చూపును నిలుపవలయును.

ప్రశాంతాత్మావిగతభీ ర్బ్రహ్మచారి వ్రతేస్థితః।
మనస్సంయమ్యమచ్చిత్తో యుక్తఆసీతమత్పరః. 14

ప్రశాంతాత్మా- ఉపరతమైన మనస్సుగలవాడయి; విగతభీః- పోగొట్టబడిన భయముగలవాడయి; బ్రహ్మచారివ్రతే-బ్రహ్మచర్యవ్రతమందు; స్థితః-ఉన్నవాడయి; మనః-మనస్సును; సంయమ్య- లెస్సగానియమించి; మచ్చిత్తః- నాయందు చిత్తముగలవాడయి; మత్పరః- నేను ఉత్కృష్టముగాగలవాడయి; యుక్తస్సన్ - సమాహితచిత్తుడయి; ఆసీత్ - వుండవలెను.

ఉపరతమైన మనస్సు గలిగి భయహీనుడయి బ్రహ్మచర్యవ్రతముగలవాడయి మనస్సును దృఢము జేసికొని నాయందు నిలిపి నన్నే సర్వోత్తమముగాదలచి యుండవలయును.

యుంజన్నేవం సదాత్మానం యోగీనియతమానసః।
శాంతింనిర్వాణ పరమాం మత్సంస్థా మధిగచ్ఛతి. 15.

నియతమానసః- నియమింపబడిన మనసుగలిగిన; యోగీ- యోగాభ్యాసకుడు; సదా-ఎల్లప్పుడు; ఏవం- ఈచెప్పబడినప్ర

కారముగా; ఆత్మానం-మనసును; యుంజన్-సమాధానము చే
యుచున్న వాడయి; నిర్వాణపరమాం- మోక్షమె యుత్కృష్ట
ముగా గలిగి; మత్సంస్థాం- నాయధీనమయిన శాంతిం- సంసా
రోపరతిని; అధిగచ్ఛతి- పొందుచున్నాడు.

ఈ ప్రకారము నిశ్చయించిన మనస్సుగల యోగి, తనమన
స్సును సర్వదా స్వాధీనము చేసికొనినవాడయి సర్వోత్కృష్టమై
నాస్వాధీనముగానుండు మోక్షసుఖమును బొందుచున్నాడు.

నాత్యశ్నతస్తు యోగోస్తి నచైకాంతమనశ్నతః।
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవచార్జున. 16

హే అర్జున- ఓ అర్జునుడా; యోగః-యోగము; అత్యశ్న
తః- అపరిమితముగా భుజించువానికి; నాస్తి-లేదు; ఏకాంతం-
మిక్కిలి; అనశ్నతః-భుజించనివానికి; నాస్తి-లేదు; అతిస్వప్న
శీలస్య- మిక్కిలి నిద్రపోవువానికి; నాస్తి- లేదు; జాగ్రతః- ని
ద్రలేక యున్నవానికి; నైవం-లేదు.

ఓ అర్జునా! ఈయోగము హెచ్చుగా తిండితినువానికి బొ
త్తిగా తిననివానికి మిగుల నిద్రపోవువానికి, బొత్తిగా నిద్ర
పోనివానికి ప్రాప్తముగా నేరదు.

యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్యకర్మసు।
యుక్తస్వప్నావబోధస్య యోగోభవతిదుఃఖహా. 17

యుక్తాహారవిహారస్య, యుక్త-తగిన; ఆహార-అన్నమును; విహార-సంచారమును గలిగిన; కర్మసు-కర్మములయందు; యుక్తచేష్టస్య-తగిన వ్యాపారము గలిగిన; యుక్తస్వప్నావబోధస్య-తగిన నిద్రయును మేలుకొనుటయును గలిగిన పురుషునికి; దుఃఖహా- దుఃఖమును బోగొట్టునట్టి, యోగః-యోగము; భవతి-అగుచున్నది.

దుఃఖమును పోగొట్టునదియైన ఈ యోగము మిత ఆహారము, మితసంచారము, మితకర్మ, మితనిద్ర, మితముగా మేలుకొనుట గల మనుష్యునకే ప్రాప్తమగును.

యదా వినియతం చిత్త మాత్మన్యేవావతిష్ఠతే।
నిస్పృహస్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా. 18

యదా-ఎప్పుడు; చిత్త- మనసు; వినియతంసత్ - లెస్సగా నిగ్రహింపబడినదై, ఆత్మన్యేవ-తనయందే; అవతిష్ఠతే-వున్నదో; తదా- అప్పుడు, సర్వకామేభ్యః- సమస్తములయిన కోరికలవలనను; నిస్పృహః- పోయిన యాశగలవాడయి; యుక్త ఇతి- యోగియని, వుచ్యతే-చెప్పబడుచున్నాడు.

ఎప్పుడయితే మనస్సును స్వాధీనము జేసికొని పరమాత్మానుసంధానము జేయుచున్నాడో అప్పుడు నిష్కాముడయిన యోగి అని చెప్ప బడును.

యథాదీపో నివాతస్థో నేఙ్గతే సోపమా స్మృతా।
యోగినో యతచిత్తస్య యుఞ్జతో యోగమాత్మనః. 19

నివాతస్థః- గాలిలేనిస్థలమందున్న; దీపః-దీపము; యథా-ఏప్రకారముగా; నేఙ్గతే-చలించదో; ఆత్మనః- మనస్సుకు; యోగం-సమాధియోగమును; యుఞ్జతః-చేయుచున్న; యతచిత్తస్య- నియమింపబడిన యంతఃకరణముకలిగిన; యోగినః-యోగికి; సా-అనిష్ఠ; ఉపమా-దృష్టాంతమని; స్మృతా- యోగజ్ఞులచేత జెప్పఁబడెను.

మనోనిగ్రహము గలిగి ఆత్మయోగము జేయుయోగికి గాలివీసినచోట దీపము ఎట్లు చలింపకయుండునో అదియే దృష్టాంతము.

యత్రోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి. 20

యత్ర- ఏ యవస్థయందు; చిత్తం- మనస్సు; యోగసేవయా- యోగానుష్ఠానముచేత; నిరుద్ధంసత్- నిగ్రహింపబడినదయి; ఉపరమతే- ఉపరతినిబొందుచున్నదో; యత్ర- ఏ యవస్థయందు; ఆత్మనా-అంతఃకరణముచేత; ఆత్మానం- పరమాత్మను; పశ్యన్-వీక్షించుచు; ఆత్మన్యేవ- తనయందే; తుష్యతి- ఆనందపడుచున్నాడో.

ఏ అవస్థయందు మనస్సు యోగానుష్ఠానముచేత నిగ్రహింపఁబడి ఉపరతిసిబొందునో ఏ అవస్థయందు మనస్సుచేత పరమాత్మను దర్శించుచు తనయందే ఆనందమును బొందునో.

సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్।
వేత్తియత్రనచైవాయం స్థితశ్చలతితత్త్వతః. 21

యత్ర- ఏ యవస్థయందు; అతీంద్రియం- ఇంద్రియ గోచరము కానట్టి; బుద్ధిగ్రాహ్యం- బుద్ధిచేత గ్రహింపదగిన; యత్సుఖం- ఏ సుఖము; (కలదో) ఆత్యంతికం- అనంతమైన; తత్- ఆ సుఖమును; వేత్తి- తెలియుచున్నాడో; యత్ర-ఏఅవస్థయందు; స్థితః-ఉన్నట్టి; అయం- ఈయోగి; తత్త్వతః- తత్త్వస్వరూపమునుండి; నచలతి-చలించడో.

ఏ అవస్థయందు ఇంద్రియములకు గోచరముగాక బుద్ధికి గ్రాహ్యమైన బ్రహ్మానందమును అనుభవించునో ఏ అవస్థయందు తత్త్వస్వరూప బ్రహ్మానందానుభవమునందున్న యోగి చలింపడో.

యంలబ్ధ్వాచాపరంలాభం మన్యతే నాధికంతతః।
యస్మిన్‌స్థితోనదుఃఖేన గురుణాపివిచాల్యతే. 22

యం- ఏయాత్మలాభమును; లబ్ధ్వా-పొంది; తతః-ఆయాత్మలాభమునకంటె; అపరం-ఇతరమయిన; లాభం- లాభము

ను; అధికం- అధికముగా; నమన్యతే-తలచడో; యస్మిన్- ఏ యాత్మతత్త్వమందు; స్థితః-ఉన్నవాడు; గురుణా-అధికమయిన; దుఃఖేనాపి- దుఃఖముచేతను; నవిచాల్యతే- చలించడో.

ఏ లాభమును బొంది అంతకన్న యితరలాభములను అధికముగా నెంచడో ఏ లాభమును బొందిన వెనుక మహత్తైన దుఃఖమువచ్చినా మనస్సు చలింపదో.

తంవిద్యాద్దుఃఖసంయోగ వియోగంయోగసంజ్ఞితమ్।
సనిశ్చయేనయోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా. 23

తం- ఆపూర్వోక్తమయిన; దుఃఖ సంయోగవియోగం- దుఃఖములతో గూడుట లేక యుండుటను; యోగసంజ్ఞితం- యోగమని సంజ్ఞాత నామధేయముకల దానినిగా; విద్యాత్- తెలియవలెను; నిశ్చయేన- నిస్సంశయమైననిర్ణయముచేత; అనిర్విణ్ణచేతసా- దుఃఖపడని చిత్తముచేత; సయోగః-ఆయోగము; యోక్తవ్యః- కూర్చదగినది.

ఆలాటి పూర్వోక్తమయిన అవస్థ వ్యసనమునకు లోబడనిది, దానిని యోగమని యెఱుఁగనలయును. ఆ యోగమును నిస్సంశయమైన మనస్సుచేతను వ్యసనములకు లోబడని మనస్సుచేతను అభ్యసించవలయును.

సంకల్పప్రభవాన్ కామాంస్త్యక్త్వాసర్వానశేషతః।

మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః.  24

సంకల్పప్రభవాన్ - సంకల్పమేపుట్టువుగాగలిగిన; సర్వాన్ - సమస్తములయిన; కామాన్ - కోరికలను; అశేషత్ - నిశ్శేషముగా; త్యక్త్వా - విడిచి; మనసైవ - మనస్సుచేతనే; ఇంద్రియగ్రామం - ఇంద్రియ సమూహమును, సమంతతః - అంతటను; వినియమ్య - నిగ్రహించి; యోగః - యోగము; యోక్తవ్యః - కూర్చదగినది.

సంకల్పమువలనబుట్టిన కోర్కెలను ధృఢమైన చిత్తముచేత నిశ్శేషముగా విడిచి ఇంద్రియవ్యాపారములను నిగ్రహించి యోగము మొదలుపెట్టవలెను.

శనైశ్శనై రుపరమే ద్బుద్ధ్యా ధృతి గృహీతయా।
ఆత్మసంస్థంమనఃకృత్వా నకించిదపిచింతయేత్.  25

ధృతిగృహీతయా - ధైర్యముచేతగ్రహింపబడిన; బుద్ధ్యా - బుద్ధిచేత; మనః - మనస్సును; ఆత్మసంస్థం - ఆత్మయందున్నదానినిగా; కృత్వా - చేసి; శనైశ్శనైః - మెల్లమెల్లగా; ఉపరమేత్ - ఉపరతినొందించవలెను; కించిదపి - కొంచెమైనను; నచింతయేత్ - చింతించకూడదు.

ధృఢమైన బుద్ధిచే మనస్సును ఆత్మయందు చొప్పింప చేసి

మెల్లమెల్లన ఉపరతి చెందవలయును అట్లు చేయుటలో వేఱు చింతకూడదు.

యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్. 26

చంచలం- చంచలమయినది గనుకనే; అస్థిరం-స్థిరముగాని; మనః- మనస్సు; యతో యతః- ఏ ఏ విషయములయందు; నిశ్చరతి- సంచరించుచున్నదో; తత స్తతః- ఆ యా విషయములవలన; ఏతత్- ఈ మనస్సును; నియమ్య- మరల్చి; ఆత్మన్యేవ- తనయందె; వశం-అధీనమును; నయేత్- పొందించవలెను.

చంచలమై అస్థిరమైన మనస్సు ఏ యే విషయములయందు తిరుగుచున్నదో ఆ యా విషయములలో నుండి దానిని త్రిప్పించి ఆత్మయందుండు నట్లు తన స్వాధీనము జేసికొనవలయును.

ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషం. 27

ప్రశాంతమనసం- శాంతిబొందిన మనస్సుగలిగిన, శాంతరజసం - క్షీణమయిన రజోగుణముగలిగిన; బ్రహ్మభూతం- జీవన్ముక్తుడయిన; అకల్మషం- పాపరహితుడయిన; ఏనం యోగినం- ఈ యోగిని; ఉత్తమం- నిరతిశయమైన; సుఖం-సుఖము;

ఉపైతిహి– (తానే) పొందుచున్నదిగదా.

శాంతిజెందిన చిత్తము క్షీణించిన రజోగుణముగలిగి బ్రహ్మస్వరూపుడై పాపరహితుడైన యోగిని శ్రేష్ఠమైన బ్రహ్మానందము దనకుదానే బొందుచున్నది.

యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖమశ్నుతే. 28

ఏవం– ఈప్రకారముగా; సదా–యెల్లప్పుడు; ఆత్మానం–అంతఃకరణమును; యుంజన్ – వశముచేయుచున్న; విగతకల్మషః– పోయిన పాపములుగలిగిన; యోగీ–జ్ఞాని; సుఖేన– అనాయాసముచేత; బ్రహ్మ–పరమాత్మను, సంపశ్యన్–లెస్సగాచూచుచున్నవాడగుచు; అత్యంతం– ఉత్కృష్టమైన. సుఖం– సుఖమును; అశ్నుతే– పొందుచున్నాడు.

ఈ పైజెప్పిన తీరున ఎల్లకాలములయందు మనస్సును నిలిపి పాపరహితుడయిన యోగి సులభముగా బ్రహ్మానందమును పొందుచున్నాడు.

సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. 29

సర్వత్ర– సమస్త భూతములయందును; సమదర్శనః–సమదర్శియైనవాడు; యోగయుక్తాత్మా– యోగముతో గూ

డిన యంతఃకరణముగలవాడయి; సర్వభూతస్థం- సమస్తభూత ములయందున్న; ఆత్మానం-తనను; ఆత్మని- తనయందు; సర్వ భూతాని- సమస్తభూతములను. ఈక్షతే -చూచుచున్నాడు.

ఎల్లభూతములయందు సమదర్శియైనవాడు యోగముతో గూడిన మనస్సుగలవాడయి సమస్తభూతములయందు తాను ను తనయందు సమస్తభూతములను జూచుచుండును.

యోమాంపశ్యతిసర్వత్ర సర్వంచమయిపశ్యతి।
తస్యాహంనప్రణశ్యామి నచమేనప్రణశ్యతి. 30

యః- ఎవ్వడు; సర్వత్ర-సమస్తభూతములయందు; మాం- నన్ను; పశ్యతి- చూచుచున్నాడో; మయి- నాయందు, సర్వం చ- సమస్తమును; పశ్యతి- చూచుచున్నాడో; తస్య- వానికి; అహం- నేను; నప్రణశ్యామి- పరోక్షమునుబొందను; నచ- వాడు; మే-నాకు; నప్రణశ్యతి- పరోక్షమునుబొందడు.

ఎవడయితే సమస్తభూతములయందు నన్నును నాయందు సమస్తభూతములను జూచుచున్నాడో వానికి నేను నాకువాడు ప్రత్యక్షస్వరూపులుగా నుందుము.

సర్వభూతస్థితంయోమాం భజత్యేకత్వమాస్థితః।
సర్వథావర్తమానోఽపి సయోగీమయివర్తతే. 31

యః-ఏయోగి; ఏకత్వం- అభేదమును; ఆస్థితస్సన్-పొం

దినవాడగుచు; సర్వభూతస్థితం- సమస్తభూతముల యందున్న మాం- నన్ను; భజతి- సేవింపుచున్నాడో; సయోగీ-ఆయోగి సర్వథా- సర్వప్రకారములచేత; వర్తమానోపి- వర్తించుచున్న వాడయ్యును; మయి- నాయందు; వర్తతే-వర్తించుచున్నాడు.

ఏ యోగి అద్వైతుడయి ఎల్ల భూతములయందు నన్ను పూజించుచున్నాడో అట్టివాడు అనేక ప్రకారముగ వర్తించు వాడయినను నాయందే ఆతడు వర్తించుచున్నాడు.

ఆత్మౌపమ్యేనసర్వత్ర సమంపశ్యతియోర్జున।
సుఖంవాయదివాదుఃఖం సయోగీపరమోమతః. 32

హే అర్జున- ఓయి అర్జునుడా; యః- ఎవ్వడు; సుఖం వా- సుఖమునయినను, దుఃఖంయదివా- దుఃఖమునయినను ఆత్మౌపమ్యేన- తన సామ్యముచేత; సర్వత్ర-సమస్తభూతములయందు; సమం- తుల్యమగునట్లుగా; పశ్యతి- చూచుచున్నాడో; సయోగీ- ఆజ్ఞాని; పరమః- శ్రేష్ఠుడని; మతః- నాకు సమ్మతుడు.

ఓ అర్జునా! సర్వభూత సుఖదుఃఖములను తన సుఖదుఃఖములుగా తలచునో అట్టిజ్ఞాని నాకు సమ్మతుడైన పరమశ్రేష్ఠునిగా తెలియుము.